## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120034689



**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# కాలం వెంట కవి

ఎల్ మాలకొండయ్య

ప్రచురణ ఆధ్వర్యం

భాషాకుటీరం

హైదరాబాద్

ముద్రణ

వివేకానంద ప్రింటర్స్

శ్రీ L మాలకొండయ్యగారి జననం 1927 రాళ్లపల్లి గ్రామం కనిగిరి తాలూకా ప్రకాశం జిల్లా చదువు మద్రాసు లయోలా కళాశాల M A ఎకనమిక్స్ ప్రథమశ్రేణి విద్యార్థిగా సాహిత్య సాంస్కృతిక క్రీడారంగాల్లో కృషి చేసి అనేక బహుమతులను పొందారు తరువాత రష్యన్ భాషలో సీనియర్ డిప్లొమా ఎకనామిక్ డెవలప్‌మెంట్‌లో పోస్టు గ్రాడ్యుయేట్ డిప్లొమా (నేపుల్స్ ఇటలి) పొందారు వాంఛీ తమిళ జర్మన్ భాషల్లో పరిచయంతోబాటు ఇటాలియన్ రష్యన్ భాషల్లో ప్రత్యేక ప్రవేశాన్ని సంపాదించారు

మద్రాసు ప్రసిడెన్సీ కళాశాలలో అసిస్టెంటు ప్రొఫెసరుగా పనిచేసి 1950 లో డిప్యూటీ కలెక్టరుగా అప్పటి అవిభక్త మద్రాసు రాష్ట్రంలో ప్రథమ శ్రేణిలో సెలక్టు అయ్యారు అనేక జిల్లాలలో డిప్యూటీ కలెక్టరుగా జిల్లా ప్లానింగ్ ఆఫీసరుగా పనిచేసారు కరీంనగర్ తూర్పు గోదావరి జిల్లాలలో కలెక్టరుగా ఉద్యోగబాధ్యతలను సమర్థవంతంగా నిర్వహించి ప్రజలందరూ హర్షించేలా సేవా కార్యక్రమాల్లో పాల్గొన్నారు 1969-70-71 లో వీరికి రాష్ట్రస్థాయి రెడ్‌క్రాస్ బంగారు పతకం అఖిలభారత స్థాయి రెడ్‌క్రాస్ మెరిట్ అవార్డులు బహూకరించబడ్డాయి చేనేత పరిశ్రమ డైరెక్టరుగా ఆం ప్ర మైనింగ్ కార్పొరేషన్ మేనేజింగ్ డైరెక్టరుగా లెదర్ ఇండస్ట్రీస్ డవలప్‌మెంట్ కార్పొరేషన్‌కు మేనేజింగ్ డైరెక్టరుగా చేసారు

వీరు ఏ హోదాలో ఎప్పుడు ఎక్కడ పనిచేసినా ప్రజాసేవా దృక్పథంతో ఆ ఉద్యోగాన్ని నిర్వహించిన మానవతావాది వివిధ లలితకళా సాహిత్య కార్యకలాపాలకు ఎనలేని ప్రోత్సాహం కల్పించిన విద్యాబాంధవుడు ఆంధ్ర ప్రదేశ్ ఫొటోగ్రఫీ అకాడమీకి వ్యవస్థాపక కార్యదర్శి యుగకర్త కీ శే శ్రీ కందుకూరి వీరేశలింగంగారు ప్రారంభించిన సంఘసంస్కరణ కార్యక్రమాలకు మళ్ళీ నిండు జీవంపోసిన క్రియాశీలి

వీరిది కవితాదృష్టి కనుకనే తమ ధీశక్తిని విశ్వవ్యాప్తంగా ప్రసరించి అనేక సూక్ష్మవిషయాలను అవగాహన చేసుకోగలుగుతున్నారు చిన్ననాటినుండి

వ్యాసాలు నాటికలు కవితలు రచిస్తున్నారు వీరి రచనలు ప్రముఖ పత్రికల్లో వెలువడుతూనే ఉన్నాయి రేడియోలో వినిపిస్తూనే ఉన్నాయి

వీరి ప్రథమ కవితాసంపుటి జీవితవలయాలు' విద్యావంతులను సామాన్య ప్రజలను సమానస్థాయిలో ఆకర్షించింది తర్వాత వెలువడిన రెండవ కావ్యం మనిషికి మనిషి వీరి సాహిత్య కృషి సమసమాజ నిర్మాణానికి ఒక మహోద్యమం కాగలదనే ఆశాభావం కలిగించింది మూడవ కవితా సంపుటి కాలంవెంట కవి వీరు నిర్మిస్తున్న సరళ సాహిత్యసౌధంలో మరో అంతస్తు వారి కలంనుంచి ప్రజాక్షేమం సౌభాగ్యం సంస్కారం సానుభూతి సహకారం ఇత్యాది భావనలు వెలువడటంలో గ్రంథనమానికి తగిన శీర్షికలు పొందుపరచ డంలో ఆశ్చర్యంలేదు వీరి భాష ప్రజాభాష భావాలు ప్రజాభ్యుదయదర్శకాలు వీరు చెప్పనది చేస చేసనది వ్రాసే చిత్తశుద్ధి ధైర్యంగల ప్రజాకవి

# మా మాట

కాలంముందా ? కవిత్వంముందా ? అనేప్రశ్న ఎప్పుడో ఉదయించింది సృష్టితోనే కవిత్వం ప్రారంభమైఉంటుంది ఇంతవరకు కొనసాగుతోంది తరువాత కాలం అవతరించి గమనం సాగిస్తోంది మానవుడు కాలం వెంట పరుగులు తీస్తున్నాడు కాలంలో లీనమౌతున్నాడు తిరిగి జన్మిస్తున్నాడు కవనాలు వ్రాస్తున్నాడు గానాలు వినిపిస్తున్నాడు కాలంలో తొంగిచూచే మార్పులను రంగు రంగుల చిత్ర పటాలుగా చిత్రిస్తున్నాడు వాటిని కానుకగా ప్రజానీకానికి అందిస్తున్నాడు కాలాన్ని అంటిపెట్టకొని నడుస్తున్నాడు ఒకప్పుడు కాలాన్ని శాసిస్తున్నాడు ఒకప్పుడు బుజ్జగిస్తున్నాడు ఒకప్పుడు తన మనస్సును పూలగుచ్ఛంగా చేసుకొని ప్రజానీకముపై ఆ పూలజల్లులు కురిపిస్తున్నాడు వారి కష్టాలు మరిపిస్తున్నాడు అందువల్ల కవి ప్రయాణం ఎల్లప్పుడు కాలం వెంటనే

ప్రఖ్యాత ప్రజా కవి శ్రీ ఎల్ మాలకొండయ్యగారు కాలం వెంట కవి అనేపేరుతో ఈ కవితా సంపుటిని ప్రచురించటంలో ఎంతో ప్రత్యేకత గోచరిస్తోంది మాలకొండయ్యగారు ప్రజాకవిగా ఏనాడో ప్రసిద్ధి చెందారు వారి కలం నుంచి ప్రజాక్షేమం సౌభాగ్యం సంస్కారం సానుభూతి సహకారం ఇత్యాధి భావనలు వెలువడటంలో గ్రంథ నామానికి తగిన శీర్షికలు పొందుపరచటములో ఆశ్చర్యంలేదు ప్రతి రచనలో ప్రజానీకాన్ని తలచి కొలిచి పిలిచే స్పందన గోచరిస్తోంది ప్రతి గేయం రమణీయమైన హారంలో పొదిగిన రత్నాలుగా భాసిస్తున్నాయి రచయితలో సునిశితమైన విమర్శ సుందరమైన కల్పన అందమైన పోకడ మనస్సుకు విందుచేసే విలక్షణత గోచరిస్తున్నాయి

ఈ గ్రంథాన్ని మా భాషా కుటీరం పక్షాన ప్రచురించడానికి పూనుకొన్నందుకు ఎంతో ఆనందిస్తున్నాం మా ప్రచురణలలో పద కొండవది అధునిక కవిత్వ ప్రచురణలో ఇది మొదటిది ఈ కావ్యాన్ని పాఠకలోకం అత్యంత ప్రీతితో స్వీకరిస్తుందని ఆదరిస్తుందని గౌరవిస్తుందని భావిస్తున్నాం భాషా కుటీరం ప్రచురణగా కాలం వెంట కవి ని తెలుగు ప్రజానీకానికి అందిస్తూ శ్రీ మాలకొండయ్యగారికి మా అభినందనలు తెలుపుతున్నాం

**భాషా కుటీరం**

# ఇందులో —

# కాలం వెంట కవి

—o₀o—

## సుప్రభాతం

ప్రొద్దు పొడుపు వస్తుంది ప్రతినిత్యం
అది మారుపులేని సత్యం
సూర్యోదయాన్ని మరచి
నిద్రాదేవతకు దాసులైనవారికి
శూన్యం సూర్యదర్శనం
కాలదన్ని కొసరు కునుకును
ఆలకించి ఉషఃకాంతుల ఆహ్వానాన్ని
వేళకు మేలుకున్నవారిదే అదృష్టం -
వారికే దొరుకుతుంది ప్రతినిత్యం సుప్రభాతం!
వారికే అందుతుంది అరుణతరుణకిరణాల
మంగళహారతుల స్వాగతం!

# కాలంవెంట కవి

కాలాన్ని చిత్రించాలి కవి
కాల గమనాన్ని
కట్టి వేయాలి కలం కదలికతో

వలలవంటి కలలనుండి విడిపించాలి వాస్తవాన్ని
విర్రవీగే అసత్యాన్ని ఓడించాలి కవి
మోసపోతున్న సత్యాన్ని గెలిపించాలి కవి

కాలం ఇక్కడా
కవి ఎక్కడో కాకుండా
కాలాన్ని కవితతో సంధించి
కాలంతో అడుగు కలిపి నడవాలి కవి
కలంతో కదంతొక్కుతూ పోవాలి కవి

# కొనడానికి సాధ్యంకానిది

కొనడానికి సాధ్యంకానిది
అమ్మడానికి అసలే వీలులేనిది ॥ఏమిటదీ ఏమిటదీ॥
స్నేహమదీ ప్రాణస్నేహమదీ॥

జీవితాలను పెనవేసేది
ద్వేషాలను తుంచేసేది
అందాలను అందించేది
అంతరంగంలో చోటుచూపేది
కోపతాపాలను తరిమేసేది
లోటుపాటులను దాచేసేది ॥ఏమిటదీ ఏమిటదీ॥
అనుబంధం అదే తీరని అనుబంధం ॥

పూవుల్లో తావిలాంటిది
మబ్బుల్లో మెరుపులాంటిది
మనసుమనసులో మమతను పెంచి
మనిషి జీవితం స్వర్గం చేసేది ॥ఏమిటదీ ఏమిటదీ॥
రాగమదీ అనురాగమదీ॥

పంతులులేకుండానే పాఠం నేర్పేది
హద్దులుదాటి ప్రవహించేది
అన్నివేళలా అమృతం కురిపించేది ॥ఏమిటదీ ఏమిటదీ॥
అమృతప్రేమేఅది పవిత్రప్రేమే అది॥

అన్నిటినీ వీటన్నిటినీ
కలిపితే అయ్యేదేమిటదీ ॥ఏమిటదీ ఏమిటదీ॥

మానవతా అదేమనిషిని పెంచే
మనసును ఇనుమడించే మానవతా ॥ఏమిటదీ ఏమిటదీ॥
ఆనందమయం అదీ
అనురాగమయం అదీ॥

(ఆకాశవాణివారి సౌజన్యంతో – ఈ మానవు పాట)

# నేడే — ఇప్పుడే

ఆరాధిస్తాను ప్రేమతో ఈరోజునే
ఆహ్వానిస్తాను హృదయపూర్వకంగా నేటినే
విజయసాధనకు చేస్తాను ప్రయత్నం ఇప్పుడే
సృష్టిలో మానవజన్మ మహోన్నతం—
కష్టిస్తాను జీవితంలో ఇదే ఆఖరురోజు అని
కామక్రోధాలను తుంచుకుంటాను నేడే
నవ్వుతాను కడుపునిండా లోకాన్ని చూచి ఇప్పుడే
విలువలను పెంచుకోవడానికి ప్రయత్నిస్తాన నేడే
అవకాశాలను ఇనుమడింప యత్నిస్తాను ఇప్పుడే
కార్యరంగంలో దూకుతాను నేడే
చేస్తానుకృషి ఈ క్షణంలోనే
కోరుతాను సలహో ఆశీస్సులను ఇపుడే
తలుస్తాను నమ్మకాల అమలుకు అదనునేడే అని
కొలుస్తాను దైవసహాయం కావాలని ఇపుడే

# ఆత్మలో ఆత్మ

ఆత్మలో భాగస్తురాలు ఆమె
ఆమె చిరునవ్వే అతని హృదయానికి స్పందన
ఆమె బాహువులే అతనికి సంరక్షణాచక్రం
ఆమె శ్రమయే అతని సౌభాగ్యం
ఆమె పెదవులే అతడు ఆధారపడగల సలహా
ఆమె హృదయమే అతని ఆనందసదనం

ఆత్మలో ఆత్మ ఆమె
అన్నిట్లో భాగస్థురాలు ఆమె

# అలలు — కలలు

అలలకు లేదు అలసట
కలలకులేదు వేసట
ఆశ్చర్యం ! అలలు శ్రమిస్తాయి
విరామంలేకుండా - ఫలితం కోరకుండా
కలలు కంటారు ఖర్చులేకుండా
అనుభవిస్తారు ఆనందం మంచికలలైతే
పొందుతారు దుఃఖం చెడ్డకలలైతే

జీవితంలో పొందలేని అనుభవాలు
ఈలోకంలో అందరాని ఆనందాలు
పొందవచ్చు స్వప్నాల్లో
చెందవచ్చు సౌఖ్యాన్ని
పనిలేని సముద్రం
పంపుతుంది అలలను ఒడ్డుకు
అవి అందుకుంటాయి గట్టును
హత్తుకుంటాయి హృదయానికి
పెదవులు తృప్తిగా పెట్టుకుంటాయి ముద్దులు
అసూయతో నిండిన కడలి
అంతలోనే లాగుతుంది అలల కళ్లెములను వెనక్కి
ముద్దుమురిపెం ముగియకముందే
కౌగిలింతలోని చక్కిలిగింతలు పొందకముందే
కలలోను అంతే -
కలలో కన్న సౌభాగ్యాలను పొందకముందే
చుప్పనాతి నిద్ర ఈర్ష్యతో చప్పున మేల్కొల్పుతుంది
ఓర్చలేక శరీరం పొందే
ఆశరీర సౌందర్య సంభ్రమాలను
ఎందులోను ఉన్నా లేకున్నా
ఇందులో ఉంది పోలిక అలలకు కలలకు

# యువతరం

విజ్ఞానానికి పునాది ఆసక్తి
జిజ్ఞాస లేకుంటే ఆర్జించలేం విజ్ఞానాన్ని
యువతరం అవుతుంది ముసలితరం
ఆసక్తితో గ్రహించలేకుంటే
తమ తరానికి లక్ష్యం విచక్షణా విజ్ఞానాలు కాకుంటే

శాస్త్రరహిత వాదనలు
హేతురహిత విశ్వాసాలు ✓
ఆధారంలేని విలువలు
కారాదు యువతకు ఆశయాలు
ఆ అవరోధాలు జయిస్తేనే
అవుతుంది యువతరం
జాతికి నేత - నీతికి నిలయం

పూర్వులు చెప్పారని
పురాణాలు వర్ణించాయని
అర్థంచేసుకోకుండా
ఆసక్తితో నిజం తెలుసుకోకుండా
నిరంకుశ భావాలను ప్రశ్నించకుండా
బూజుపట్టిన బుర్రల ఆదేశాలను
విని అనుసరిస్తే వాటినే ఉపదేశాలుగా
యువతకు లేదు రేపు
జాతికి లేదు నేడు

# మహర్షి - మనిషి

భోగివేమన
యోగివేమన
నరుడు వేమన
గురుడు వేమన -
పామరుల భాషలో
చెప్పాడు పాఠాలు
ఎనలేని నీతులను
వడబోసిన అనుభవాలను
అందించాడు అందరికీ
వేమన చెప్పని వేదాంతం
వచించని కవిత్వం
గాలించి వెతికినా
కనిపిస్తుందా ఎక్కడైనా !
యోగుల్లో మహాయోగి
కవుల్లో మహాకవి
సంస్కర్తల్లో మహాసంస్కర్త
మహర్షిగా మారిన మనిషి మన వేమన

# దేవుడే దిగివస్తే

గుళ్లు గోపురాలు కట్టించేది
వాళ్ళ గొప్పలు చాటుకోవడానికా ?
నీకు నిలువ నీడకల్పించడానికా ?
దేవుడి పేరుతో దోస్తారు ప్రజల
తప్పుతారు పాపపు కూపాలు
నింపుతారు స్వంతసంచులు
కొడతారు గుప్పెడుకారం నీ కళ్ళల్లోనే
గుడిలో ఉంచిన నీకే పూస్తారు మస
మనిషికి నీపై కూడా ఎంతకస !

నీవు చూస్తున్నావా స్వామి
మేం చేస్తున్న ఘోరాలను
మాలో ఒకమనిషిగా దిగివస్తే
ఈ లోకాన్ని కళ్ళువిప్పచూస్తే
తెలుస్తుంది వీళ్ళు నీ పేరుతో చేసే
చెప్పరాని ఘనకార్యాలు !

# నమ్ముతాను

ప్రతి వర్షపు బిందువుకు
ప్రకృతి శోభిస్తుందని
ప్రతిచల్లని ఎల్లగాలికి
పువ్వులు పులకరిస్తాయని
నమ్ముతాను నేను

ప్రతి చీకటిరాత్రికి
ప్రమిద ఒకటి దొరుకుతుందని
ప్రతి ప్రయత్నానికి
ఫలితం కొంత దక్కుతుందని
నమ్ముతాను నేను

నేటిపనిని నెరవేర్చడమే
రేపటిపనికి పునాది అని
మానవశక్తి వినియోగిస్తే
మంచి ఎంతైనా చేయవచ్చని
నమ్ముతాను నేను

నమ్మకంలో పుట్టుతుంది శక్తి అని
నమ్మకంలో వికసిస్తుంది జీవితం అని
నమ్ముతాను నేను

# కట్టగల వంతెనలు

మీరువసించేది మేడమిద్దెల్లో
మేము పడివుండేది పూరిగుడిసెల్లో-

మీరుధరించేది విలువైన వస్త్రాలు
మేము వేసుకొనేది చింపిరిపాతలు -
మీరుభుజిస్తారు పంచభక్ష్యాలు
మేము తింటాము దొరికితే గంజిమెతుకులు-

మీరువాడుతారు నాజూకుభాష
మేము ఆడుతాము మొరటుమాట -
మీకు మాకు దూరం ఎంతోలేకున్నా
మనమధ్య ఉన్నాయి ఎన్నో అంతరాలు
పూడ్చడానికి పూనుకుంటే
వీలయ్యే అఖాతాలు
కట్టడానికి పూనుకుంటే
అనువయ్యే వంతెనలు
కలపడానికి మనసుంటే
కలసిపోయే అసమానతలు

# స్వర్ణలిఖితం

భార్య అనే ఆలయానికి
అలుపెరుగక ప్రయాణించే యాత్రికుడు భర్త
సజ్జనుడికి స్వర్గధామం భార్య
సృష్టికర్త గీసిన బంగారు చిత్రపటం భార్య
భర్తే పరికించగలడు
దేవుడిచ్చిన మణిమాల భార్య
భర్తే ధరించగలడు
స్వర్ణలిఖితం భార్య
భర్తే పఠించగలడు

# జీవాత్మ - పరమాత్మ

ఎక్కడికో యాత్ర మహాత్మా
హిమగిరుల్లో పరమాత్మను వెతకడానికి మహాత్మా
ఇక్కడ నీలో ఉండేది ఏమిటో మహాత్మా
నాలో నీలో నిలిచిఉండేది జీవాత్మే
పరమాత్మేలేనిది నిలుచునే జీవాత్మ
అయినావెళ్లి వెదకమనిచెప్పింది బహిరాత్మ
ఇక్కడే ఉందని చెప్పలేదా అంతరాత్మ
తెలుసుకోలేవా పరమాత్మలో అణువేజీవాత్మఅని
పరమాత్మ జీవాత్మల కలయిక అని

# జీవితం

నింగికి నేలకు
ఊహకు వాస్తవానికి
అనుకున్నదానికి
అయ్యేదానికి
మధ్యన ఉన్నదే
మానవజీవితం
ఒకప్పుడది దుఃఖభరితం
మరొకప్పుడు రసభరితం
అదే జీవితానికి అర్ధం
మనుగడకు తాత్పర్యం

# లోకం పోకడ

వింతగాను విడ్డూరంగాను ఉంటుంది
వింటే కంటేలోకంపోకడ
ధనవంతుడి మాటకు తాళంవేసేవాళ్ళు
పలుకుబడిదార్ల మాటకు డబ్బాకొట్టేవాళ్ళు
పేదలను హీనంగా చూసేవాళ్ళు
బీదలకు సహాయంచేయనివాళ్ళు
తమ అవసరాలకు
తందనాలు పాడేవాళ్ళు
అవసరం తీరగానే
అసలు కనుపించనివాళ్ళు
మాటిమాటికి మాటఇచ్చేవాళ్ళు
ఇచ్చినమాట నిలుపుకోనివాళ్ళు
పచ్చనిబ్రతుకులు పాడుచేసేవాళ్ళు
పచ్చినెత్తురు పీల్చుకునేవాళ్ళు
కొంపలెన్నింటినో కూల్చేవాళ్ళు
గంపలతో సంపాదించేవాళ్ళు
లోకం పోకడ తీరూ తెన్ను
సాటి మానవుడికే అర్థంకాదు
అర్థం అవుతుందో లేదో
ఆ పైవాడికైనా ?

# భూలోక స్వర్గం

కులూ మనలి లోయలు దాటి
హిమాలయ కనుమలలో పయనిస్తుంటే
అనిపించింది అదే భూలోక స్వర్గంఅని-
కొండలు లోయలుదాటి
ఆకాశంలోకి వెడుతుంటే
మేఘాలు క్రిందకి దిగుతుంటాయి

ఆ కనువిందే సౌందర్యాలు
ఇంద్రుడో చంద్రుడో
పెట్టిన కోటలో కట్టిన మేడలో
మరోమయుడు నిర్మింపనున్న
నరులకందని సౌధాలో అనిపిస్తుంది

వంకర టింకర తారురోడ్డు
పర్వత శిఖరాలను పెనవేసుకొని
స్వర్గానికి నిచ్చెనలా ఉంది.
నా కారే దేవేంద్రుడి రథంలా
బెదురు చూపుల గొర్రెలమందల
అదురు చూపుల కాపరుల గుంపులుదాటి
మేఘాలపొదల పొగల దూసుకొని

శిఖరాల ఒంపుల్లో ప్రేకల గొంతులు నొక్కుతూ
కురుక్షేత్రంలో పార్థుని రథంలా
సాగిస్తుంటే గమనం
అనిపించింది నడిచేది నేలపై కాదేమోనని

తెచ్చింది రోదసియానం జ్ఞప్తికి
అందుకుంటున్నామా చుక్కల్ని
సందిట కౌగిలించుకుందామా చంద్రుడిని అని

భయానికి అర్థం తెలియక్కో
ప్రాణాలకు విలువ కట్టకో
తేనెతెట్టెలలా వ్రేలాడు కొండశిఖరాల్లో
జారుతూమేస్తున్న గొర్రెల గుంపులు చూసి
అనిపించింది - గొర్రెగా జన్మించినా
సార్థకమౌతుందేమో జన్మ కొంతైనా అని
తెల్ల తాచులమించు కొండ చరియలు
మంచేకరిగి మల్లె మొగ్గలమాలలై
పాలవెల్లువలై పారతున్న జలపాతాలే
బియాస్ నది పుట్టిన పురిటిల్లు
సన్నని తెల్లపట్టు దారాలవలె
ఆ నీటిధారలు ఇంతై ఇంతింతై
మహానదియై మనిషికి జీవనాధారమైంది
బియాస్ నది రూపంలో

ఈ అందాలన్నీ మానవుడి కోసం
దేవుడు తీర్చిదిద్దిన సౌందర్యరాసులు
కైలాసం కళ్ళముందే ఉన్నా
కనిపించరు శివపార్వతులు
వినిపించవు తాండవ నృత్య శబ్దాలు
వంధిమాగధుల కోలాహాలాలు
అనిపిస్తుంది మనల్ని విడిచి
మరేలోకానికో వలస వెళ్ళారేమోఅని

పర్వతశిఖరాలకు ఆకాశానికీ
చేతులు కలిపి కావిస్తున్నాయి పెళ్ళి
చేస్తున్నాయి పౌరోహాత్యం మబ్బులు -

ఆనాటి దేవతలకు ఉద్యానవనం
అప్సరలకు ఆలయం అయిన మన హిమాలయం
ఈనాడు మానవులకు నివాసం
మన జవానులు దేశాన్ని రక్షించే స్థలం

భూలోక స్వర్గమంటూ ఉంటే
అంటాను అది ఇదే ఇదే అని
అది ఇక్కడే ఇక్కడే అని

# గోతులుతవ్వని జీవితం

జంతువులమధ్య నివసించడం
సుఖమేమో అనిపిస్తుంది ఒక్కొక్కప్పుడు -
అవి ఎంతో ఆనందంగాను
సంతృప్తికరంగాను ఉంటాయి
వాటిని చూచిన కొలది
ఇంకా చూడాలనిపిస్తుంది
పన్నులు ఎగవెయ్యాలని ఆలోచించవు
దేవుడిపట్ల తమ బాధ్యతలేదని తర్కించవు
తోటి జీవికి ఊరికే ముప్పుతిప్పలపెట్టవు
పక్కవారికున్నదని ఏడవవు
తమకులేదని చింతించవు
పేరుప్రతిష్టలు కావాలని ప్రాకులాడవు
పదవులు చేపట్టాలని ప్రణాళికలువేయవు
పోట్లాడుకోవు భాష మత విభేదాలగూర్చి
పాటించవు పోటీ రాజకీయాలు
వాంఛించవు అకారణంగా
పాపాలకు పన్నగడలు వేయవు ✓
పుణ్యాలకు యత్నాలు చేయవు ✓
'అవిలేవని ఇవికావాలని ఫిర్యాదులుచేయవు
ప్రక్కవారి పతనానికి గోతులు తవ్వవు
అందుకే జంతువుల జీవితమే సుఖదాయకమేమో! ✓

# పని - తప్పులు

పనులు చెయ్యని వాళ్ళు
చెయ్యరు ఏ తప్పులు
పనులు చేసేవాళ్ళు
చేయవచ్చు ఏ తప్పులైనా
కాగితాలు రూల్సు ప్రకారం
తిరగేసి సంతకాలు పెట్టేవాళ్ళు
రూల్సుకు మేలు చేస్తారేమోకాని
ప్రజలకు మాత్రం చేయలేరు మేలు
తప్పులు చేయకుండా
తప్పించుకోవడమే వారి లక్ష్యం
దానివల్ల పనులు మాత్రం జరగవు
ప్రజల కోర్కెలు తీరవు

వడ్లుదంచితే అవుతాయి బియ్యం
అందులో కొన్ని నూకలు తప్పవు
వడ్లేదంచకుంటే
నూకలమాటేమిటి
అసలు బియ్యమే ఉండవు —
పై వారుకూడా
రూల్సును పాటించడమే
ప్రధానలక్ష్యంగా పెట్టుకుంటే
పనులు చేయనివారిలో
గాలించినా దొరకవు తప్పులు
కార్యాన్ని సాధించదలచినవాళ్ళు
చేయకతప్పక పోవచ్చు కొన్నితప్పులు —
కార్యం సాధించి
తప్పులు చేసి పట్టుబడేకంటే
పనిమాని కాగితాలకట్టల పోషించడమే
క్షేమంగా భావిస్తారు కొందరు అధికారులు -
తప్పులు చేయడం తప్పకపోయినా
కార్యం సాధించాలంటాను
రూల్సుకు దాసులం అయ్యేకంటే
ప్రజల అవసరాలు తీర్చడమే ప్రధానం అంటాను

# చీకటివెలుగుల కలయిక

చీకటిలో చేస్తారు చెడ్డపనులు
వెలుతురులో కరిగిపోతాయి కోర్కెలు
ఎండకు మంచులాగ -
చీకటిలో భయపడతాం
వెలుగులో విహరిస్తాం
చీకటి శాశ్వతం
వెలుతురు కల్పించుకోవచ్చు
వెలుతురు మోక్షానికిదారి
చీకటి చెడుగుకుద్వారం

చీకటిచేసిన పాపమేమో
వెలుతురు చేసిన పుణ్యమేమో
అందరు పొగుడుతారు వెలుతురును
నిందిస్తారు చీకటిని
చీకటే నేరస్థుడైతే
వెలుగే రక్షకభటుడు
చీకటిలేనిదే వెలుగుకు విలువేలేదు
వెలుతురులేనిదే చీకటికి మోక్షంలేదు
వెలుగులో తెలుసుకుంటాం మనలగూర్చి
చీకటిలో దాచుకుంటాం నిజస్వరూపం
వెలుతురు పెరిగితే
చీకటి తరుగుతుంది
చీకటి తరిగితే
విజ్ఞానం వికసిస్తుంది
చీకటి వెలుగుల కలయికే
సుఖదుఃఖాల మానవ జీవితం

# నిన్న - నేడు - రేపు

అనుభవించినది నిన్న
అనుభవించనిది రేపు
అనుభవిస్తున్నది నేడు

అందమైంది రేపు
ఇంకా అందలేదు గనుక

తీసివెయ్యబడింది నిన్న
ఉపయోగించాం గనుక

అతిమధురం నేడు
అనుభవిస్తున్నాం గనుక

నిన్న ఖాళీ అయిన పాత్ర
రేపు నింపవలసిన కలశం
నేడు ఆస్వాదిస్తున్న మాధుర్యం

నిన్నరాత్రి నిద్రలో ఉంటాం
నేడు ఉదయం చైతన్యులం అవుతాం
రేపుసాయంత్రం - ఆలోచిస్తాం తర్వాత కార్యక్రమం

గడచింది ఒక అనుభూతి -
నెమరువేయడానికి
నడిచేది ఒకస్వర్గం—
అనుభవించడానికి
వచ్చేది ఒక స్వప్నం —
అమలు పరచడానికి

నిన్న చెల్లని నాణెం - పారవెయ్యి
రేపు - ప్రామిసరినోట్ దాచుకో
నేడు నగదురొక్కం వాడుకో

నిన్న సమాధి
రేపు స్వర్గం
నేడు నిజమైన జీవితం

మరచిపో నిన్న
అనుభవించు నేడు
ఆశించు రేపు

# తప్పులెంచువారు

తప్పులెవ్వరూ తెలిసి చేయరు
తెలిసినా ఒప్పుకోరు సులభంగా-
తప్పును ఒప్పుకునే వాళ్ళు
మానవుల్లో దేవుళ్ళే
తమలో దాస్తారు కొండంత లోపాలను
ఇతరుల్లో వెతుకుతారు లేని తప్పులు-
తాము చేసేవన్నీ ఒప్పులనీ
ఇతరులవన్నీ తప్పులనీ
తలుస్తారు మానవులు

ఇతరుల్లో తప్పులను గుణించడం కంటే
తమ ఒప్పులను పెంచడానికి ప్రయత్నిస్తే
మనిషిని మనిషిగా చూడవచ్చు
మనసుకు శాంతిని పొందవచ్చు
తప్పులెంచువారు తమకు వర్తించనంతవరకు
పాటించరు చెప్పే నీతులు

# ఆ రా ధ న

అందం ఉంది అన్నిట్లో
అది ఆనందించేవారి సొత్తు

శ్రామికుడి కండమెదలికలో
కార్మికుడి సమ్మెటదెబ్బల సవ్వడిలో
కవి కలం కదలిక పంక్తుల్లో
చిత్రకారుని కుంచెరంగుల మెరుపుల్లో
గాయకుల కంఠస్వర విన్యాసాల్లో
నాట్యకారుల నృత్యభంగిమల్లో
ప్రేమికుల హృదయ స్పందనల్లో
స్నేహితుల అనుబంధాలమాలల్లో
ఆత్మను ఆనందింపచేసేది అందం

సుహృదయులకు అందమే మతం
మాట తప్పని వారికి సత్యమే అందం
అందాన్ని ఆరాధించాలి
ఆనందాన్ని ఆస్వాదించాలి

# చావులేని శిలలు

మహాబలిపురం ఇసుక
తీసకెళ్ళింది కెరటాల ఒడ్డుకు
రేపెందినాలో ఖావతరంగాలు
చూపింది పల్లవరాజుల చరిత్ర
సుందరమైన శిల్పశిథిలాలు
మిరుమిట్లుగొలిపాయి కళ్ళు
పంచపాండవుల రథాలను
అర్జునుని తపస్సును అపరిమితంగా వర్ణించి
అలస శయనించాయి ఆరాళ్ళు

రాతి రాతిపై చిత్రాలు
నాటి శిల్ప సౌందర్యాలను
కోటి విధాలుగా చాటుతున్నాయి నిశ్శబ్దంగా
రాతిరథాలు నడుస్తున్నాయా
ఏనుగులు ఘీంకరిస్తూ
సమర రంగంలోకి దూకుతున్నాయా అని —

చావులేని ఆ శిల్పాలు
చాటుతున్నాయి తమ ప్రతిభను నేటికీ
వెలలేని ఆ శిల్ప చాతుర్యం
మరువలేని ఆ శిలల సౌందర్యం
మనసును తరింపచేసే మననం చేస్తాయి
మరుగుపడిన మానవ చరిత్రను

# ఆర్చేదెవరో

ఎటుచూసినా దుమ్ము దుమారం
ఎటువెళ్ళినా పల్లేరు ముళ్ళబాటలు
ఆకాశం అంతా కారుమబ్బులు
సముద్రమంతా పెల్లుబికే కెరటాలు
అంతాకల్లోలం - అల్లకల్లోలం
పెరిగే ధరల పెనుతుఫానుల్లో
ఆందోళనల ముళ్ళ పొదల్లో
కార్మిక కర్షక సమ్మెలకారుమబ్బుల్లో
పేదరికపు పెనుభూతపు కరకు కోరల్లో ✓
దిక్కుతోచని మరి ఎన్నో సుడిగుండాల్లో
చిక్కుకున్న ప్రజానీకం✓
అలవరించి పోతుంది
కలవరించి పోతుంది
ఈ దిక్కు తోచని చిక్కుల వలయం
ప్రజకు దారితెలియని కల్లోలం
ఆర్చేదెవరో ✓
తీర్చేదెవరో ✓

# శరీరంతో స్నేహం

రక్తమాంసాలముద్ద
ఎముకలగూడు
అంతుతెలియని ఆత్మ
కలిసిన ఆకారం శరీరం —

ఎండ ముదిరినా
వానకురిసినా
శరీరానికే ముప్పు
కంటికి కండ్లకలక
ముక్కుకు పడిశం
నడుముకు నొప్పి
చెవికిపోటు
కీళ్ళవాపులు
వాతం—పిత్తం—కఫం
శరీరానికి అన్నిజబ్బులే
ముల్లు గుచ్చుకున్నా
కళ్ళు ఎర్రనైనా
ఎన్నో డాక్టర్ల సలహాలు
అన్నిటికీ సూదిమందులు
డాక్టర్లు హెచ్చేకొద్దీ

రోగాలు పెచ్చుఅవుతూనే ఉన్నాయి
మందుల ఉత్పత్తి పెరిగేకొద్దీ
రోగాల పెరుగుదలరెట్టింపు అవుతూనే వుంది
రోగాలకు కారణాలు
అనారోగ్యపు తిండి అలవాట్లే అయినా
వైద్యులు నిపుణులు
గ్రంథాలు తిరగేసే
మందులపట్టీలు ఇస్తారు
ముందుగా ఎలహోలకు గుసుము పుచ్చుక ని
వయసుమళ్ళిన కొద్దీ
అవయవాలు ఉడుగుతాయి
అన్ని జబ్బులు అంటిపెట్టుకుంటాయి
అందులో అనేకాలు
మందుతో తీరేవికావు
పుర్రెతో వచ్చినబుద్ధులు
పుడకతోగాని ఎన్నట్లు
వయసు మళ్ళితే వచ్చే రోగాలు
శరీరంతో స్నేహించేసే
దానితోనే పోతాయి
మళ్ళీరాకుండా -

# సగం - సగం

సగం సగం  చెరిసగం
భార్యసగం - భర్త సగం
నేలసగం - నింగిసగం
గాలిసగం - అగ్ని సగం
ఆత్మసగం - పరమాత్మ సగం
సగం సగం - చెరిసగం

నీరు సగం - పాలు సగం
మందు సగం - మట్టి సగం
నెయ్యి సగం  నూనె సగం
బియ్యం సగం - రాళ్లు సగం
నరుడు సగం - నారాయణుడు సగం
సగం సగం - చెరిసగం

తల్లి సగం  ఎల్ల సగం
శివుడు సగం  శక్తి సగం
స్వర్గం సగం  నరకం సగం
అంతా సగం  సగం
జగమంతా సగం సగం
సగం సగం  చెరిసగం

# తిరిగిరావు

ఆడినమాట రాదు తిరిగి
విడిచిన బాణం రాదు మరలి
గడచిన కాలం దొరకదు మళ్ళీ
పోయిన అవకాశం చిక్కదు చేతికి
అందుకే—
ఆడాలి మాటలు జాగ్రత్తగా
వేయాలి బాణం గురిచూచి
గడపాలి కాలం
ఉపయోగవంతంగా
చేసకోవాలి అందిన అవకాశాన్ని
అమృత ప్రాయంగా

# దాచనిదే రహస్యం

ఏది రహస్యం?
కాదా పెదవి దాటినదే రహస్యం
కాగలదా దాచినదేది రహస్యం!
మరొకరికి మళ్ళీ చెప్పవద్దని
మరోసారి చెప్పిందేకాదా అసలు రహస్యం!
రహస్యాలు తీస్తాయి ప్రాణాలు
రహస్యాలు పోయగలవు ప్రాణాలు
ఆశ్చర్యాల్లో ఆశ్చర్యం
రహస్యంలో రహస్యం
రహస్యంలో ఉన్నట్లు ఉన్న మర్మం!

# మహత్తర శక్తి

ఓపిక ప్రధానం మనిషికి
ఓపిక లేనిదే విజ్ఞానం పొందలేం
ఓపిక లేనిదే జీవితాన్నే గడపలేం
కోపాన్ని తుంచుకుని
ఓపికను పెంచుకుంటె
మనిషి చూడగలడు
మనిషిని మనిషిగా - మనీషిగా
మనిషి వెలయగలడు
మహామాన్వితమూర్తిగా
ఓపిక ఒక మహత్తర శక్తి

# ఉపన్యాస ఉన్మాదం

ఉపన్యాసం చాలామందికి ఆహారం
అది ఎందరికో పానీయం
దానితోనే వారికి తీరుతాయి ఆకలిదప్పులు
అది కొందరికి వృత్తి మరి కొందరికి అభిమానకళ
మైకుపట్టుకుంటే తుప్పుపట్టేదాక
దంచుతారు గంటల కొలది ఉపన్యాసాలు
లేకుంటే లేదు వారికి సంతృప్తి
ఉపన్యాసంతో తీరినా ఉన్మాదం వారికి
వారి అంతులేని గాధల వల్లింపుతో
గొంతులు చించుకొని గొప్పలు దొర్లించినా
తీరవు రవ్వంతైనా శ్రోతల బాధలు వ్యధలు

# అబద్ధానికి నిజం తెలుసు

పెదవికదల్చకుండా

పెద్దఅబద్ధాలు చెప్పవచ్చు

తీయవచ్చు కూడా ప్రాణాలు అవే

విప్పచెప్పే అబద్ధాల్లో

తప్పకబయటపడుతుంది కొంతైనా నిజం

కాపాడవచ్చు ప్రాణాలు ఇవే—

అబద్ధం నిజానికి తెలిసినాలేకున్నా

నిజం అబద్ధానికి తప్పక తెలుసు

# జాతి

ఒక పూవుతో కాదు పూలమాల
ఒక మొక్కతోనే కాదు వనం
ఒక మనిషితోనే కాదు జాతి
ఒకరి ఆలోచనే కాదు ప్రజాభిప్రాయం
అన్ని కులాలకు
అన్ని మతాలకు
అన్ని భాషలకు
అన్ని అభిప్రాయాలకు
జాతిలో వుంది తావు—
ఉన్నత శిఖరాలందుకోవడానికి
జాతి నడవాలి నీతి నిచ్చెనపై
ఏకధాటిగా ఐకమత్యపు తాటిపై
అపుడే ఉంటుంది జాతిలో అందరికి తావు
జాతి పుష్పానికి అవుతుంది నీతితావి

# ట్రాజెడీ - కామెడీల గారడీ

ప్రతి ట్రాజెడీ చావుతోను
ప్రతి కామెడీ పెళ్ళితోను
చేస్తారు అంతం
మరి చావు లేకుంటే ట్రాజెడీ
పెళ్ళిలేకుంటే కామెడీ
కాగలవా కథలు ?
తీరగలవా వ్యథలు
ప్రతి కామెడీలో ట్రాజెడీ
ప్రతి ట్రాజెడీలో కామెడీ
ఉందనే సత్యం ఎందరికి తెలుసు
ఈ రెండూ రెడీమేడ్ దుస్తులు
వాటిని ధరించడంలోనేవుంది
ట్రాజెడీ కామెడీల గారడీ

# మెదడుకు కలం

మెదడుకు నాలుక కలం

ఆ కలమే ప్రగతికి బలం

ప్రపంచానికి అధినేత మనిషి

మనిషికి అధిపతి మెదడు

మెదడుకు పదును

అభ్యుదయానికి అదును

మెదడు బూజుపడితే

మనిషికి ఇక రుజువేది ?

# సమకూరేదెలాగు?

కోట్లమందికి పూటకూటికే గతిలేకుంటే
కొద్దిమంది పూటకే కోట్లుగడిస్తుంటే
సమసమాజం సమకూరేదెలాగు
జనసమూహం ఇక బ్రతికేదెలాగు

ఎందరికో ఎల్లకాలం రెక్కాడినా
ఒక్కపూటైనా డొక్కనిండకుంటే
కొందరికి ఒక్క నిముషమైనా రెక్కాడకుండానే
బొక్కసం నిండుతుంటే
ఎందరో ఆకలిబాధతో మలమల మాడుతుంటే
కొందరికి తిన్నది అరగడమే సమస్య అవుతుంటే
ఉన్నవారే నిత్యం అధికారం చలాయిస్తుంటే
లేనివారు ప్రతినిత్యం ఊడిగంచేస్తుంటే
కోట్లప్రజల శ్రమఫలితంతో
కొందరే సుఖపడుతుంటే
సమసమాజం సమకూరే దేలాగు?
జనసమూహం ఇక బ్రతికేదేలాగు?

# క్రాంతిపథం

కర్షకసోదరా కాడిగట్టరా
భూమిదున్ని ప్రజలకు భుక్తి కల్పించరా
కార్మికసోదరా నడుంగట్టరా
కష్టించి ప్రజలను పోషించరా
కవిసోదరా కలంపట్టరా
క్రాంతిపథంనే చిత్రింపరా
విధ్యార్థిసోదరా చదువు నేర్వరా
భావిభారతాన్ని సరిదిద్దరా
విజ్ఞాని సోదరా జ్ఞానాన్ని వెదజల్లరా
సంఘాన్ని వికసింప జేయరా
ఉద్యోగి సోదరా కళ్ళుతెరవరా
ఉదరపోషణ వెనుకరా – ప్రజాసేవ ముందురా
క్రాంతిపథంలో నడిచేటందుకు
శాంతిపథం నెలకొల్పేటందుకు
తెలుసుకోరా దేశంమంటే మనుషులనీ
మనుషులంటే మనం అని
మనం అంటే కులమత భాషాది బేధాలులేని
ఈ జనులందరూ అని

# పని ఔషధం

పనిచేయని వారికి చేయడు సహాయం దేవుడైనా
పనిచేయకుంటే లేదు మోక్షం మనిషికి
ప్రతిపనీ సమకూర్చకపోవచ్చు సంతోషాన్ని
పనిచేయకుంటే పొందజాలం సంతోషం
కన్నులముందున్న పనిని కానలేక
కానరాని పనులకై వెతుకుతారు ఎందరో

జీవితవృక్షానికి పట్టుకొమ్మలు పనులే
పనులు ఆలోచనలచేతుల్లో పనిముట్లు
ఆలోచనల తర్జుమా మనిషి
పనులే విషయసూచిక మనిషికి
వాటినిబట్టి మనిషిని తెలుసుకోవచ్చు కనుక

కష్టించినవారే విజ్ఞానులు
కాకుంటే వారి విజ్ఞానం అనుమానస్పదమే
గొప్ప పనులు చేయకుంటే
గొప్పవారు కాజాలరు
ప్రస్తుతం మంచిపని చేస్తే
శాశ్వతంగా మంచి చేసినట్లే
కృషిలో కీర్తిని పొందవచ్చు
ఆనందాన్ని అనుభవించవచ్చు
చెడ్డపని చేయడానికి
కారణం మానసిక జాడ్యమే
అపాయాలు లేనప్పుడు
మంచిపని చేయడం సాధారణం
అపాయాన్ని లెక్కించక
మంచిపని చేయడం మహోన్నతం
పనిలో ఉన్నది పవిత్రత
పనిలో ఉన్నది ఆనందం
పనిలో ఉన్నది ఆరోగ్యం
పనిలో ఉన్నది జీవం
పని దేవుడిచ్చిన ఔషధం
పనియే పరమ దైవం

# ఎక్కడ దేవుడు?

ఎవరు దేవుడు
ఎక్కడ దేవుడు
దాక్కున్నాడా దేవుడు
వెతకడానికి మానవుడు —
సర్వాంతర్యామి కాడా దేవుడు
ఉంటాడా కట్టుబడి దేవుడు
కట్టి ఉంచినా గుళ్ళొన్నో మానవుడు —
ఏమంటుంది వేదాంతం
ఏమిటి దాని సారాంశం
కాడా దేవుడు సర్వాంతర్యామి
లేడా దేవుడు నీలోనే
ఆత్మలేని శరీరం నిత్యమా
దేవుడులేని నీవు సత్యమా —
ఎవరు దేవుడు
ఎక్కడ దేవుడు
నీలోనే ఉన్నాడు దేవుడు
ఇక్కడే ఉన్నాడు దేవుడు

## శాస్త్రజ్ఞుడు – శ్రామికుడు

ప్రారంభించేది మేధావులే అయినా
కార్యసాధన కావించేది శ్రామికులే–

శాస్త్రజ్ఞుడు
కలంతో ప్రణాళికవ్రాస్తే కాగితంపై –

శ్రామికుడు
కండబలంతో కడతాడు వాటిని నేలపై –
ప్రణాళికలు వ్రాయడానికి
పద్ధతులు చెప్పడానికి
కావాలి శాస్త్రజ్ఞుడు –

ఆలోచనలు అమలుపెట్టడానికి
ఫలితాలను ప్రజలకందివ్వడానికి
చేయాలికృషి శ్రామికుడు–

ఇద్దరూ చేతులు కలిపితేనే
సాధించగలరు ప్రగతి
లేకుంటేలేదు సుగతి

# సొగసు

అమ్మాయి హొయలు సొగసు
హంసనడక సొగసు
విచ్చిన నెమలి పింఛం సొగసు
నెచ్చెలి విచ్చిన కురులు సొగసు
దానిమ్మ గింజలు సొగసు
తరుణి పలువరుస సొగసు

చేపల ఆకారం సొగసు

చెలినేత్ర ద్వయం సొగసు

రంభా స్తంభాలు సొగసు

రమణి ఊరువు సొగసు

ఎచ్చుక గూళ్ళు సొగసు

ప్రియురాలి కొప్పు సొగసు

ఉదయరాగం సొగసు

హృదయేశ్వరి హాసం సొగసు

పున్నమ వెన్నెల సొగసు

కన్నియ వన్నెలు సొగసు

శివుని తలలోని శశిరేఖ సొగసు

అబల తలలోని మొగలి రేకు సొగసు

చంద్రబింబము సొగసు

ఇందువదన మోము సొగసు

రాచిలుక పలుకు సొగసు

రమణీమణి రాగం సొగసు

# దేశానికి మనం

వెట్టిచాకిరి పోవాలి
స్వేచ్ఛాజీవితం గడపాలి
ప్రజాపాలనలో
పేదరికం పోవాలి
సోదరులంతా ఏకంకావాలి
ధరల పెరుగుదల ఆపాలి

ధనికుల దుండగాలను నిలపాలి

నల్లదుకాణాలు నశించాలి

వస్తువులన్నీ సరసమైనధరలకే అందివ్వాలి

శ్రమించేవారు పాలుపంచుకోవాలి

పరిశ్రమలన్నిటిలో –

ప్రజాప్రభుత్వానికి చేయూతఇవ్వాలి

ప్రజాక్షేమానికి పట్టుకొమ్మగా ఉండాలి

పరిపాలనలో అవినీతిని

పట్టుదలతో తొలగించాలి

దొంగవ్యాపారులకు

దోపిడీ విధానాలకు చెప్పాలిస్వస్తి

వ్యర్థపు వ్యయాన్ని ఆపాలి

పొదుపును పెంచాలి

ప్రగతిని ఎదిరించేశక్తుల

ప్రతిఘటించి నిలవాలి

దేశం మనకేమి చేసిందనేకాక

దేశానికిమనం ఏమిచేస్తున్నామో ఆలోచించాలి

# తాము – ఇతరులు

ఇతరులు చేసేవి చెడ్డపనులు
తాము చేసేవి మంచిపనులు
ఇతరులు గట్టివారైతే గర్వులువారు
మనమైతే సాధకులం నిగర్వులం

మనంవారికి నచ్చకపోతే
వారు అసూయపరులు
వారు మనకు నచ్చకపోతే
మానవ నైజశాస్త్రంలో నిపుణులంమనం
వారు ఇతరులతో మంచిగావుంటే
కాకా పట్టేవారు మస్కా కొట్టేవారు
మనంఅయితే నాగరికతకు ప్రతిరూపాలం
ఇతరులు నిదానంగా పనులుచేస్తే
వాళ్ళు సోమరులు చేతగానివాళ్ళు
మనం అదేపనికి యుగాలు తీసుకున్నా
ఆలోచించి చేసేవాళ్ళం

ఇతరులు చేసేవన్నీ చెడ్డపనులు - విమర్శనీయాలు
తాముచేసేవన్నీ మంచిపనులు - ప్రశంసనీయాలు
ఇతరుల తప్పులు నలుసులైనా దూలాలుగా కనిపిస్తాయి
తమ తప్పులు దూలాలైనా నలుసులుగా కూడా కనిపించవు
ఇదే తేడా తమకు ఇతరులకు

# చవి చూడు

పనిచేసి చూడు
అసూయను భరించిచూడు
నిజం చెప్పిచూడు
నిందలు మోసిచూడు
మంచిచేసి చూడు
మనుషుల కృతఘ్నత చవిచూడు
కళ్ళుతెరచి లోకాన్నిచూడు
కళ్ళుమూసుకొని నిన్నునువ్వుచూడు

## అందాలొలికించే హైదరబాద్

బాబు ఇది హైదరబాదు
ఇది కట్టింది ఓ పెద్ద నవాబు
లేదు దీనికి సాటినగరం వేరేది
కాదుసమానం దీనికి ఇంకేది !
అటు హైదరబాద్
ఇటు సికింద్రాబాద్
రెంటికి మధ్య—
గుసగుస లాడే హుసేన్ సాగర్

తారలతో సరసాలాడే చార్ మినార్
సినీతారలతో మెరిసే చిత్రవిహార్
రంగురంగుల పూసలతో
రతనాల గాజులతో
డెందాలకు బందాలేసే
అందమైన లాడ్ బజార్

చావు లేనిసౌందర్య కళా సంపదకు నిలయం
సాలార్ జంగ్ పురావస్తు ఆలయం

ముసిముసి నవ్వుల మూసీ ఒడ్డున
రిట్టిలు వేస్తే గట్టుకు జేర్చే హైకోర్టు

తీరిక సమయం జోరుగ గడపాలం టే
గండిపేట మరివుండనే వుంది

తళతళ మెరిసే సారాహోటల్లో
వగలమారి వనితల వయ్యారాలు
మధురమధుర పానశాలల్లో
మరులు గొలిపే మగువల సయ్యాటలు

ప్రణయవిలాసాలకు పబ్లికుగార్డెను
ప్రజల విలాసాలకు విధాన సౌధం

అందాలకు చిందులు దొక్కే ఆబిడ్ రోడ్డు
సురులకు కూడా మరులు గొలిపే సుల్తాన్ బజార్

గరీబులుండే అమీరుపేట
అమీరులుండే గరీబునగర్
అక్కడ జూస్తే -
ఉప్పర్ షేర్వానీ - అందర్ పరేషానీ
బాహర్ చున్నా అందర్ మద్దీ

అందాలొలికించే
బృందావనమీ హైదరాబాద్
ఆనందాలందించే
నందనవనమీ హైదరాబాద్
బాబు ఇది హైదరాబాద్
ఇదికట్టింది ఓ పెద్దనవాబ్

# కష్టించేవారు-అనుభవించేవారు

కష్టించేది పేదప్రజానీకం
అనుభవించేది ధనికవర్గం
డబ్బు పెట్టుబడి ధనికులదైనా
అసలు పెట్టుబడి శ్రామికుల కండబలమే
విత్తనం మంచిదైనా
కృషి చేయందే పంటరానట్లు
ధనం ఖర్చు పెట్టినా
యజమానులుగా తామున్నా
పనివాళ్లు శ్రమ చేయందే
చెమటోడ్చి
కండలు కరిగించి కష్టించందే
పంటలు పండవు
కర్మాగారాలు ఫలితాలివ్వవు -
పెట్టుబడి దార్ల పెట్టెలు
డబ్బులతో నిండవు
అయినా
పేదవాడికి లేదు మోక్షం
నిండదు వాడిపొట్ట ఒక్క క్షణం

# సంస్కర్త

## 1

రాజమహేంద్రవరాన్ని కేంద్రంగా జేసుకొని
పాశుపతం - కలం పోటుతో
దునిమినావు దురాచారాలనెన్నో
లంచగొండుల - గుండెల చీల్చినావు
కుమతుల ఆటలిక
సాగనీయనంటూ
కులమత భేధాలపై
ధ్వజము నెత్తినావు
ఎన్న వయసు పెళ్ళిళ్ళ నాపినావు
కూడదు పొమ్మంటు
వంచించబడినవిధవల
నొసటసింధూరం దిద్దినావు
తెలుగు సాహిత్యమతల్లికి
తొలిమల్లెమాలనల్లి
గద్యతిక్కన్నగా
పేరుపొందినావు

గాఢనిద్రను గోదారి
నీటద్రోస –
పరవళ్ళ స్రవంతిని
యువతలో నిలిపినావు
మూఢనమ్మకాల
చీకటి రక్కస రెక్కలనరికి
భావితరాలకు
వెలుగునందించినావు
అజ్ఞానలోకంలో ఉన్నజనతకు
విజ్ఞాన విరజాజుల
విరుల సరుల నందించినావు
శకునాలు పూనకాలు
బూటకాలని చాటినావు
అధోగతికి పోతున్న
ఆంధ్రజాతికి
అభ్యుదయ పథం చూపిన
అమరమూర్తి
నీవెప్పుడు మాకుమార్గ దర్శివే
నిన్నెప్పుడూ మరవదు ఆంధ్రప్రజ
నీకిదే మానివాళి !

# సంస్కర్త

## 2

వీరేశలింగం కాదు ఒకవ్యక్తి
ఆయన సంఘాన్నే మార్చిన సంస్థ
దేశాన్నే మార్చిన సంస్కర్త
అనాథలను ఆదరించిన మహావ్యక్తి
బాలవితంతువుల పాలించిన మహాత్ముడు
వరకట్నాలను ఆపిన మహనీయుడు
నమ్మినదానిని అమలు పరచిన నీతిపరుడు
దురాచారాలనెదుర్కొన్న నిర్భీతి పరుడు
పేదలను ఆదుకొన్న ధర్మ విదురుడు
అవినీతినెదుర్కొన్న గంభీరుడు
సాహిత్యాన్ని ఖడ్గంగా వాడుకొన్న కర్మవీరుడు
సంఘం వెలివేస్తే జంకని ధైర్యశాలి
తన సంస్కరణలతో సంఘాన్ని మార్చిన సంస్థ

# మనిషి

చంద్రలోకానికి పంపుతున్నాడు
రాకెట్టుతో రాయబారం మనిషి
సాటి మానవునితో సూటిగా
మాటాడలేకున్నాడు ఆ మనిషి
నోరువిప్పితే - అన్నీ అపార్థాలే
చేయికదిపితే అన్నీ అభావాలే
సృష్టి గుండెనుచీల్చి పరిశీలించే
అతిసూక్ష్మగ్రాహి మనిషి
మనసువిప్పి కళ్ళఎదుట ఉంచినా
ఆశ్చర్యం ! మనిషిని గ్రహించలేడు మనిషి !!

# వెలుతురుపూవులు

డబ్బు ఉన్నవారిదేకాదులే పెద్దరికం
ఊరివారందరికి ఉన్నదిలే సమభాగం
సామ్యవాదం సమకూరునులే ✓
కలిమి లేమి ఏకముకాక మానవులే
ఉన్నవారే అధికారం చేయడం మారునులే
ఊరందరికి ఆ అధికారం దక్కునులే
అవకాశాలన్నీ ఉన్నవాళ్ళకే కాదులే
లేనివాళ్ళ ఆశలుకూడ చిగురించునులే
చీకటి గుంపులు చెదరునులే
వెలుతురుపూవులు విరియునులే
కులమతబేధాలు కూలునులే
మనుషుల మమతలె నిలుచునులే
సమసమాజం తెచ్చినవెలుగు
చీకటిగుండెల్లో గుచ్చునులేశూలం
ప్రజలందరికి చేకూర్చునులేశాంతి
పేదల ఇళ్ళల్లో నిలుచునులేకాంతి
(ఆకాశవాణి వారి సౌజన్యంతో - ఈ మాసపుపాట)

# నిజం - అబద్ధం

నిజం ! నిజం !

ఏది నిజం    ఏమిటి నిజం ?

ఎలా ఉంటుంది నిజం

ఎవరు చెప్పుతారు నిజం

ఎవరు నమ్ముతారు నిజం

మరి అబద్ధమో !
ఆహా ఎంత తీపి !
ఎంత అందం !
ఆ మాటలోనే ఉంది ఆనందం
ఆ పలుకులోనే ఉంది మకరందం
చెప్పేవారా
కోకొల్లలు
వినేవారు నమ్మేవారా
వెతకనక్కరలేదు
ఎదురు చూస్తుంటారు ఎందరో
చెవులు విప్పుకుని
కళ్ళు మూసుకుని
ఎద్దు ఈనిందంటే
గాట కట్టి వెయ్య మనడానికి –
అబద్ధం ఎంత తీపో
నిజం అంత చేదు
నిజం ఎంత నగ్నమో
అబద్ధం అంత అందాల వేషధారి
నిజానికి నిజమంటే

కళ్ళుమూసుకుంటారు
నగ్నాన్ని చూసే ధైర్యంలేక
అబద్ధమంటే భూతద్దాలు ధరించి
పరిశోధిస్తారు లేని వాటిని వెతకడానికి
గోరంతలను కొండంతలను చేయడానికి —
నిజం నడుస్తుంది
ముళ్ళ బాటలో కాళ్లతో
అబద్ధం పయనిస్తుంది
అందాల పల్లకీలో
నిజానికి మూస్తారు అన్ని ద్వారాలు
అబద్ధాన్ని ఆహ్వానిస్తారు పూలమాలలతో
నిజాన్నిచూచి నిప్పులా భయపడతారు
అనృతాన్ని కొలుస్తారు అమృతంలా
నిజానికి నిజమెంత చేదు!
నిజంగా అబద్ధం ఎంత తీపి!
అబద్ధానికి వున్న విలువ
నిజానికి లేదు ఎన్నడు
ఆదినుండి నేటివరకు ఇదీ జగం!

# ఆకలి ఆకలి ఎందరికో

ఆకలి ఆకలి ఎందరికో
మరి ఆ మాటే తెలియదు కొందరికి
చింపిరి పాతలు ఎందరికో
చీనాంబరములు కొందరికి
గూడే ఉండదు ఎందరికో
మేడలు మిద్దెలు కొందరికి
నిత్య అవసరాలే తీరవు ఎందరికో
అవసరమంటూ ఉండదు కొందరి
అంతులేని దుఃఖం ఎందరికో
అక్కరలేని సుఖం కొందరికి
ఈ అందరితో ఆ కొందరు
పాలు పంచుకోగలిగితే
మనసు కలుపుకోగలిగితే
ప్రపంచమంతా శుభోదయం
మనిషి బ్రతుకే కాదా సుఖమయం

(ఆకాశవాణివారి సౌజన్యంతో – ఈ మాసపు పాట)

# క్రొత్త సంవత్సరం

క్రొత్త సంవత్సరం తేవాలి
కొంతైనా మార్పు
ఎన్నో సాధించలేక పోయినా
ఎన్నడూ సాధించనివి
కొన్నైనా సాధించడానికి
కట్టుకుందాం కంకణం
చేద్దాం విద్యార్థులను అంకితం
విద్యాభ్యాసానికే
ఉద్యోగులకు చెబుదాం
ఉద్యోగ నిర్వహణకే అంకితం కావాలని
నాయకులను హెచ్చరిద్దాం
తమ అంకితం ప్రజాహితవు కేనని
ప్రజలకు జ్ఞాపకం చేద్దాం
సర్వప్రజానీకం కావాలి అంకితం
సమైక్యతకు పురోభివృద్ధికి అని
వ్యాపారులను మందలిద్దాం
కత్తిలను అధిక ధరలను ఆపాలని
సరకులను సరసమైన ధరలకు అమ్మాలని

## భూలోకనరకం

పేదలగుడిసెల్లో
ఈగల దోమల గుంపుల్లో
చింపిరిపాతల దుస్తుల్లో
గంజినీళ్ళ చిప్పలతో

మలమలమాడే

పేదప్రజల జీవితంకాదా

భూలోకనరకం -

పేదలశ్రమతో

పెద్దలు మేడలుకట్టి

ముద్దుగా నివసిస్తుంటే

నిలువ నీడలేక

విలపించే శ్రామికుల జీవితం॥

కాదా భూలోక నరకం

ఈ నరులు నివసించేవి నగరాలా !

వీరు అనుసరించేది నాగరికతా !

కొందరికి జీవితం స్వర్గంలాగున్నా

ఎందరికో జీవితాంతం నరకమేనా ?

బలమున్నవాడిదే బ్రతుకా

సన్నవాడి జీవితం సున్నాయేనా ?

అందుకే కావాలంటున్నాం సామ్యవాదం

# ఉద్యోగమెందుకు

ఉన్నారెందరో ఉద్యోగస్తులు
అందులో ఎందరో చాదస్తులు
అధికారం ఆయుధం సద్వినియోగం చేస్తే
సమకూర్చవచ్చు సర్వజన సంక్షేమం

ఆశ్రితుల కివ్వవచ్చు ఆశ్రయం
తీర్చవచ్చు పేదల బాధలు
పేరుకే ప్రాకులాడితే
పేదల గొడవ అరణ్యరోదనమే
తియ్యగ మాట్లాడేవారికి–వేయిరకాల ఫలితాలు
పొగడలేనివారిగతి – వేసవదగ్గర గొంగళే

దంచుతున్నారు ఉపన్యాసాలు అనేకులు
ఉంచుతున్నారు పేదవాళ్లను మురికివాడల్లోనే
చెప్పే నీతులకు – చేసే చేతలకు
బోడితలకు మోకాలిముడి సామెతే–
ఉపన్యాసాలు ఊరందరికి
ఉపయోగాలు స్వంతవారికి
అవినీతి పరులకు ఆశ్రయం
ఆంతరంగికులకు ప్రమోషన్లు——
రోజంతా సభలకు విందులకే చాలందే
వినతిపత్రాలు వినేదెప్పుడు?
ప్రజల అవసరాలు తీర్చేదెప్పుడు ?

# మైలురాయి

ప్రతి జన్మదినం
ఒక మైలురాయి జీవిత రహదారిలో
ప్రతి పుట్టినరోజు
ఒక మెట్టు జీవిత పథంలో
మైలు మైలుకు అంచనాలేసి
మళ్ళీ తిరిగి చూచి ముందడుగు వేయాలి
గమ్యస్థానం చేరే లక్ష్యం
వాగులు వంకలు అడ్డువచ్చినా వీడరాదు
అడుగడుగునా ఎదుర్కొనే
అనేక గడ్డు సమస్యలను
మెలకువతో దాటాలి
మరో మైలు నడవాలి
మరో జన్మదినం వచ్చేనాటికి
మంచి పనులింకెన్నో చేయాలి
మానవ జీవితం సఫలం కావాలి

# అర్ధనారి—ఆదిశక్తి

ఆడుది లేకుంటే
మగవాడి బ్రతుకు మట్టిపాలే
మగజీవితం మూగజీవితమే
పసికూనలకు
పాలుపోసి పెంచి
మగడిని ఎల్లలని
మంచిగ చూసే మహాతురాలు-

భౌతికంగా
రెండు దేహాలైనా
మానసికంగా
భార్యాభర్తలు ఒకటే-
అందుకే ఆడుది ఆదిశక్తి
శివుడు అర్ధ నారీశుడు-
అన్నం వేళ అన్నపూర్ణతానే
ఆరోగ్యం చెడితే-
వైద్యుడు తానే
అన్ని వేళల భర్తకు
అండ ఆమే
వంట వార్పే కాడనుండి
ఇంటి పనులన్నీ
కంటికి రెప్పలా
కాపలాకాచే
మాతృ మూర్తి భార్య
ఆమే అర్ధనారి - ఆదిశక్తి
అతివ లేకుంటే లేదు
జగతికే చైతన్యం

# ఎర్రజెండా

కావాలంటే సిరిసంపదలు
కోరాలి చిరుసంసారం
మంది ఎక్కువైతే మజ్జిగ పలచనలాగా
ఎక్కువమందిని కంటే తక్కువ సుఖమే దక్కేది
తక్కువ విత్తనం విత్తడం
చిక్కని మడిలో మొక్కలు తక్కువ చేయడం
చక్కని ఎరువులు వేయడం
అందుకే—
అందమైన సౌఖ్యాన్ని పొందడానికే -

బిడ్డలకనడానికి కారకులం మనమైతే
అందుకు నిందించేది విధినా ?
ఎంత చక్కని అపనింద
ఆ నోరులేని విధిపైన !
ఇంకా బిడ్డలనుకని
నిరుద్యోగ సమస్యకు
దీర్ఘం దిద్దుతావా
హనుమంతుడి తోకలాగ ?

కార్యమనే మర్యాద పేరుతో జరిపే
గర్భాదాన సంబరానికి చేసే పండుగలాగే
చేయాలి గర్భాన్ని నిరోధించే
వ్యాసక్టమీ ట్యూబెక్టమీ ల పండుగలు
దీవించాలి దంపతులను ఇద్దరు ఎల్లలనే కనాలి అని
పెళ్ళికి ఇవ్వాలి
నిరోధ్ సామాగ్రి కానుకలుగా
అందుకే అందరం కలపాలి చేతులు
మేమిద్దరం మాకిద్దరుచాలు అని
చూపాలి ఎర్రజెండా -
ఆపాలి పుట్టుకల బండి

# అందమైన బ్రేక్

అంటారు పెద్దలు నిదానం ప్రధానం అని
దేనికైనా ఉంటుంది సమయం సందర్భం

నేటి సమాజంలో
అభివృద్ధిని అందుకోవడానికి
వేగం ఎంతో అవసరం
లేకుంటే పందాలతో
పోటీలతో పనే ఉండదు
పోటీ వేగం లేకుంటే
పురోభివృద్ధి రానేరాదు

హద్దులు నియమాలు
అవసరం అన్నిట్లో
తొందరపాట్లో
పొరపాట్లు దిద్దుకోవడానికి
సమయాన్ని సక్రమంగా సర్దుకోవడానకి
అవసరమే నిదానం వేగంలో

పురోగమనానికి అవసరం వేగం
అతివేగానికి అందమైన బ్రేక్ నిదానం

# అందాల గోదావరి

అందాల గోదావరి
బంగారు గోదావరి
గలగల పారేను గోదావరి
మిలమిలా మెరిసేను గోదావరి॥
ఆ ఒడ్డునా ఈ ఒడ్డునా
అడుగడుగునా
బంగారు పంటలే పండేను
భాగ్యమెంతో వెలిసేను॥
సరస కిన్నెర సాని
శబరి చెలిక త్తెగా -

వయ్యారములతోడి
వెయ్యి మెలికలు తిరిగి
గలగలపారేను గోదావరి
మిలమిలా మెరిసేను గోదావరి॥
ఒకచెంత బొగ్గు గనులు
ఒకచెంత వరిపొలాలు
ఒకచెంత అరటికొబ్బరితోటలు
సరిగమపదనిస - సంగీతం
శ్రుతి తప్పక పాడేను గోదావరి॥
పాపికొండల నడుమ
పండు వెన్నెలలోన
పరవళ్ళు త్రొక్కేను గోదావరి -
మెండైన అడవుల్లో
నిండుగాపారేను గోదావరి
అందాల చిందులతో
అందరిని మురిపించు గోదావరి॥
మోసాలు ఎరుగని
ద్వేషాలు పెంచని గోదావరి
బంగారు పంటలే పండించి
ప్రజల కన్నముపెట్టు గోదావరి॥
శ్రీ లక్ష్మి గోదావరీ
భూలక్ష్మి గోదావరీ
అందాల గోదావరీ
బంగారు గోదావరీ

# సుఖసంసారం

కట్నాలపై మోజులతో
కానుకలపై కోర్కెలతో
కన్యల గొంతులకు ఉరివేసే వారుంటే
ఏదీమార్గం సుఖ సంసారానికి
వరకట్నాలు కారాదు
ప్రేమికులకు అవరోధం

వివాహానికి కావాలి
ఇద్దరిమధ్య ప్రేమ
కుదరాలి పొత్తు
కారాదు డబ్బు పెళ్ళికి అవరోధం

ప్రేమను పొందాలి కాని కొనరాదు
ప్రతినిత్యం ప్రేమను ఆరాధించాలి
దానికి ధనంతో విలువకడితే
అవుతుంది అదే చివరకు ఉరితాడు
కాజాలదు ప్రేమికులకది సుఖసంసారం

# సంతోషం అంటే

సంతోషం ఒక బోసినోటి పసిపాప
సంతోషం ఒక ఉన్నికంబళి చలిలో
సంతోషం ఒక బొటనవ్రేలు పసిపాప నోటిలో
సంతోషం ఒక యింటివాకిట్లో ఎదురయ్యే మనసుకింపైన
వస్తువు
సంతోషం ఒక ప్రియమైన మిత్రుడిని ఎంతకాలానికో
కలుసుకోవడం
సంతోషం ఒక దోగాడే పాప తలుపుగొళ్ళాన్ని అందుకోవడం
సంతోషం ఒక తరగతిలో అన్ని ప్రశ్నలకు జవాబు
చెప్పకలగడం
సంతోషం బుజ్జోడు తన బూట్ లేసులు తానే కట్టుకోవడం
సంతోషం వర్షంలో తడుస్తూ వడగళ్ళను ఏరుకోవడం
సంతోషం పచ్చిక బయళ్ళలో లేడిలా పరుగెత్తడం
సంతోషం ఆకాశం సముద్రం కలసే చోటును దర్శించడం
సంతోషం ఎనిమాకు రూపాయి బొరుగులకు
అర్థరూపాయి అమ్మదగ్గర పొందడం
సంతోషం ఐస్ క్రీమ్ చప్పరిస్తూ కారిపోయే చుక్కలను
జుర్రుకోవడం
సంతోషం ఆపదలో ఉన్నవారికి చేయూతనివ్వడం
సంతోషం ఒకరికి ఒకటి మరొకరికి ఇంకొకటి !

# సంగీతం

అనవచ్చు సంగీతం
ఆధ్యాత్మిక భౌతిక జీవితాల్లో
మధ్యవర్తి అని-
సృష్టి సమ్మేళన శబ్దమే
సంగీతానికి పునాది అని
సాహిత్యం-సంగీతం అక్కా చెల్లెళ్లు
రెండింటిలోను ఉట్టిపడుతుంది
ప్రత్యేక కళ

పుట్టెడు ఉద్బోధకంటే
ఒక్క సమరగీతం
కలిగిస్తుంది ఉద్రేకం
మారుస్తుంది మనలను
దేశ రక్షకులుగా
బోలెడు తర్కశాస్త్రంకంటే
ఒక్క భక్తిగీతం కలిగిస్తుంది
నమ్మకం దేవుడిపైని

పాతబడదు సంగీతం ఎన్నటికి
ఎంత అలవాటుపడితే
అంత శ్రావ్యంగా ఉంటుంది
అన్నం బట్ట ఇల్లు విద్యల తర్వాత
మనిషికి కావలసింది సంగీతమే
ఆరోగ్యానికి హాని లేకుండ
అతిగా అనుభవించగలిగేది
సంగీతమొక్కటే
ప్రేమ శాంతి సమరాల్లో
చక్కని ఆయుధం సంగీతం-
లలిత కళలన్నిటిలో
జీవరాసులన్నిటికి
ఆనందాన్ని సమకూర్చేది
సంగీతమొక్కటే
భగ్న హృదయాలను
అతకగలదు సంగీతం
ఆత్మను మేల్కొలపగలదు సంగీతం
అంగాలకు గరపగలదు అనుభూతి సంగీతం
సర్వజనామోదం సంగీతం
మధురానుభూతి సంగీతం
మానవుడికి దేవుడిచ్చిన వరాల్లో
మకుటాయమానం సంగీతం

# విజ్ఞాన నిలయం

ప్రపంచ నాగరికతకు
పుస్తకమే పునాది
అక్షరానికి
ప్రాణం పోయకపోతే
అక్షరాల చేరికతో
అచ్చు వేయకపోతే
ఉండేదా నేటి విజ్ఞానాభివృద్ధి ?
ఆదినుండి నేటివరకు
మానవుడు సాధించిన అభివృద్ధి
అందేదా నేటి మానవుడికి?
పుస్తకం పుస్తక భాండాగారంలేకపోతే
మనం మనచరిత్ర మరెలావుండేదో
చరిత్రను పుస్తకమెంత మార్చిందో !
తరతరాల మానవ విజ్ఞాన నిలయమే
గ్రంథం గ్రంథాలయం
వీటిని భద్ర బరచడమే
మనం భవిష్యత్తుకు
అందివ్వగల ఆస్తి

# అరకుకన్య

నింగి వలచింది నేలను
తొంగి చూచింది అరకులోయను
వంగి నిలిచింది
సందిట కౌగలించింది
కనుసైగ చేసింది
అనువైన కోనలో
కోరిక తీర ముద్దులిచ్చింది

నింగినేలను వలచి

మంచుపొగలతో పంపింది ప్రేమలేఖ

నేలకు దిగివచ్చి

వలచి ఎలిచి

ఎలిచి కౌగిట జేర్చి

కొండ శిఖర అధరాల

కోరికి నొక్కి

పచ్చికబయళ్ళ

పమిట కొంగుపై

రంగురంగుల పువ్వుల

పుప్పొడి గంధాల సువాసనల చిలికి

వనమూలికల పరిమళాల పన్నీరుచల్లి

ఎల్లగాలుల చల్లగావీచి

అరకు సఖియలైన గిరులు తరులు

తన్మయమునొంద

అబల అరకు కన్నియను

ఆకాశ రాజు ఆలింగనముచేసి

పరిణయమాడె

ప్రకృతి హర్షింప

# దేనిపై కోపం

దేనిపై కోపం
ఎవరిపై వైరం
ప్రభుత్వ విధానాలపైనా
ప్రజల ఆందోళనలపైనా

ధనికుల దోపిడులపైనా

పేదల నిస్సహాయతపైనా

పెట్టుబడిదార్ల పరిశ్రమలపైనా

బక్కవాళ్ళ చెక్క దుకాణాలపైనా

నరులనే మింగే రాక్షసులపైనా

నరాలు నలిగేటట్లు కష్టించే కార్మికులపైనా

తంతి తపాలా తీగలపైనా

రోడ్లు రైళ్ళ తెన్నులపై

ఉపాధ్యాయుల ఉద్ఘాటనలపైనా

పరీక్షలు వద్దనే విద్యార్థులపైనా

ఇడ్లీధరలు హెచ్చింపుకా

వీధి గుడి దీపాల సవరింపుకా

నెలనెల ఉద్యోగులు జీతాలు

పొందుతున్నందుకా

దినదినం నిరుద్యోగుల క్యూ

పొడిగింపు అవుతున్నందుకా

దేనిపై కోపం

ఎవరిపై వైరం

# అక్షరరశ్మి

విధివిరామంలేని సమయాల్లో కూడా
వెల్లుబుకుతాయి నాలో ఊహాగానాలు
మనసులో పేరుకున్న అనుభవాల
మంచుగడ్డలు
ఆవేదనావేడికిరణాలకు కరిగి అక్షర
రూపంలో

భావతరంగాల ఎగుడు దిగుడు
లోయల్లో ప్రవహించి
ప్రశాంత పరిసరాలకు చేరుకున్న
కవితావాహినే ఈ 'కాలం వెంట కవి

అరుణకాంతి రేఖల్లో
మెరుపుతీగల చణుకుల్లా
ప్రతికవనంలో ఉంటాయికొన్ని
తళుకులు

ప్రతిపుట ప్రతిఅక్షరం
మెరుపు తీగలే అయితే
కావ్యాకాశం కాగలదా ఆకర్షనీయం

కవితకు అంశాలు
సమకాలీనం కావాలి
సమాజ జీవితం
ప్రతిబింబించాలి
ప్రాసంది సామాన్యుడికి అర్థంకావాలి

ఊహాలకు ఛాయా చిత్రం కవిత
వెలుగు నీడలకు రంగులు దిద్దడమే
అవుతుంది కావ్య చిత్రపటం
అనుభవాలకు అద్దంలో
అర్థం చూపడం కవనం

కవితా ఉత్పత్తికి కారణం
హృదయ వీణాతంత్రులను సవరించి
మీటడం
నివురుగప్పిన భావాలను విసిరి రగిలించడం
ఎగిరే ఊహా విహంగాలకు
కలం నరా దారాలతో ఉచ్చులువేయడం
ఏదో చెప్పాలనే మంచుపొరల ఆవేదనలను
అక్షర రశ్మితో ద్రవింప జేయడమే

# అహం - నిగ్రహం

ఆత్మ నిగ్రహం
అన్నిటినీ మించిన ఆయుధం
ఆత్మను గెలిచే వరకు
అందరికీ బానిసలమే
అహాన్ని తుంచినవాడే
ఆత్మను గెలిచినవాడు
అందరిలో దైవాన్ని
అవలోకించేవాడు

# బంద్‌ల జీవితం

చీటికి మాటికిబంద్

కాలేజీ సీట్లు రాకుంటేబంద్

కాపీలు కొట్టవద్దంటేబంద్

పరీక్ష ప్రశ్నలు కఠినంగా ఉంటేబంద్

పంతుళ్ళ మార్పులకై బంద్
ప్రజలకై పెట్టిన కార్యాలయాల్లో
విన్నపాల కాగితాలు కదలకుంటేబంద్
భాషారాష్ట్రాలు కావాలనిబంద్
మళ్ళీ వాటిని విభజించాలని బంద్
నదుల నీటి పంపకాలకు బంద్
సదుపాయాలెన్నో కావాలని బంద్
మరి కోర్టులు బంద్
రైళ్ళు బంద్ బస్సులు బంద్
అకారణంగా
దుఖాణాలు బంద్
అకస్మాత్తుగా పసిపిల్లల పాఠశాలలు బంద్
పాలసరఫరాలు బంద్
నీటి కొళాయిలు బంద్
కోటి విధాలుగా
నేటి ప్రజా జీవనమే బంద్
ఈ బంద్‌ల జీవితమే
ఇబ్బందులతో గడపాలి మరి !

# ప్రజా ప్రతిజ్ఞ

శత్రుత్వం కోరలేదు మనం
మిత్రత్వమే చాటించాం ఎల్లప్పుడూ-
శాంతిప్రియులం భారతీయులం
క్రాంతిపథంలో పయనించాలి మనరథం

మనం చేయవలసిన కృషి దేశరక్షణ
మనం కోరవలసిన విజయం విశ్వశాంతి
శత్రుత్వమే కావాలని కవ్వించే
శత్రువులకు కూడా నేర్పగలం మిత్రత్వం

లేవండి నడుంకట్టి నడవండి
శత్రువునుండి స్వదేశాన్ని రక్షించండి
అజాగ్రత్తవల్ల పరిణామం
అసమర్ధతకంటే అనర్ధకం
శత్రువును నమ్మరాదెన్నడు అన్న
సత్యాన్ని తెలుసుకోనాలి మనం -

యుద్ధకాలంలో ఉండాలి జాగ్రత్తగా
ప్రతి పౌరుడు
ఇంటి దొంగను వేయికళ్ళతో
కనిపెడుతుండాలి
ఎరికితనాన్ని ప్రచారంచేసేవాళ్ళను
సమరానికి సహాయం నిరాకరించే
వాళ్ళను
శత్రువులకు రహస్యాలు అందించే వాళ్ళను
నిత్యావసర వస్తువుల ధరలు పెరచే
వాళ్ళను

అక్కడి కక్కడే పట్టివేయడం
ప్రభుత్వానికి అప్పగించడం
ప్రతిపౌరుని కర్తవ్యం
పగవాణ్ణి పారద్రోలే కృషిలో
సగభాగం పంచుకోవాలి జవాన్‌తో
కిసాన్

జవాన్ పోరాడితే యుద్ధరంగంలో
కిసాన్ శ్రమపడాలి పంటపొలంలో
ప్రతిభారతీయుడు ప్రతిజ్ఞ చేయాలి
అత్యధికంగా పంటలు పండిస్తానని
అసలు ధరలకే సరుకుల్ని అమ్ముతానని
ప్రభుత్వానికి అండగా నిలుస్తానని
పొంచ్చుపన్నులెన్నైనా చెల్లిస్తానని
తినుబండారాలను దాచుకోవడం
పేదలను దోచుకోవటం-అరికడతానని
ప్రతిపౌరుడు చేయాలిప్రతిజ్ఞ
విజ్ఞాని - విద్యార్థి
వ్యాపారి అధికారి
కర్షకుడూ, కార్మికుడూ
విరోధిని ఎదిరిస్తానని
విజయం సాధిస్తానని చేయాలి ప్రతిజ్ఞ
(బంగ్లాదేశ్ విముక్తి సమరసందర్భంలో వ్రాసింది)

# జగమే ఒకచెరసాల

చేసిన నేరాలకు శిక్ష అనుభవించేవాళ్లు
చేయని నేరాలకు గురి అయ్యేవాళ్లు
సమంగానే అనుభవించే చోటు
కృష్ణజన్మస్థానం విడిది

మంచీ చెడ్డా తప్పు ఒప్పు
అంతా ఒకటిగా చేసే
సామ్యవాద ఆలయం
నేటిమనకారాగార నిలయం

కటకటాల మధ్య కట్టివేసినదే చెరసాలా
కాదాలోకమే ఒక పెద్ద బందిఖానా
బయటపడే బాధలు మరి సరసాలా
అవేకావా చెరసాలను మించిన యమశాలలు

# ప్రజాసేవకే కావాలి రూల్సు

పనులు క్రమ పద్ధతిలో నడవాలంటే
కావాలి రూల్సు
అతురాలా రూల్సుకే కట్టుబడి ఉంటే
నెరవేరజాలవు పనులు
అందనేరవు చేతికి ఫలితాలు
తప్పులను అరికట్టడానికి
తప్పక అవసరమైనా రూల్సు
సత్ఫలితాలను పొందాలంటే
కారాదు మనం రూల్సుకు సేవకులం
రూల్సే కావాలి ప్రజలకు అనుకూలం
ఎనులు సక్రమంగా నెరవేర్చడానికే పెట్టినా రూల్సు
పనులను ఆపడానికే
ఉపయోగిస్తారు వాటిని ఎందరో
ప్రజల బాధలను చూడడానికి కళ్ళులేనివాళ్ళు
రూల్సుకు గుడ్డిగా బానిసలైన వాళ్ళు
జీతాలు నెలసరికి ఎలాగయినా పుచ్చుకొనే వాళ్ళు
సంఘానికి చేయలేరు మేలు
పేదవాళ్ళకు కాలేరు మిత్రులు

# సలహా

సలహాను ఎవరూ ఎప్పుడూ ఆహ్వానించరు
సలహా అవసరమున్న వాళ్ళు
అసలు దానిని కోరనేకోరరు
అడగని సలహా అన్నిటి కంటే చౌక
అందరి సలహాలు వింటే
అందరి తప్పులు మనవే అవుతాయి
మనకు సలహా ఇచ్చు కోవడంకష్టం
ఇతరులకివ్వడం సులభం
సలహా ఇవ్వగలంగాని
దాన్ని ఆచరింప జేయగలమా ?
ఇస్తాం టన్నుల్లోసలహా
పుచ్చుకుంటాం గ్రాముల్లోనే
ఇతరులను సలహా అడగడం
వారిని చక్కిలి గింత పెట్టడానికే !

## వన్నెవన్నెల మేఘాన్ని

నేను మేఘాన్ని
మెరుపులతో వెలుగును ఇచ్చే మేఘాన్ని
ఉరుములతో బెదిరించే మేఘాన్ని
కారు మేఘాన్ని
కఠోర హృదయాలకు
మారు పేరుని
నీలి మేఘాన్ని
మేలిముసుగులకు
జలతారు అంచుగా వెలిసే మేఘాన్ని
రంగురంగుల మేఘాన్ని
రమ్యమైన రమణి చెక్కిలి కాంతిని
వన్నెవన్నెల మేఘాన్ని
కన్నె ఎల్ల చిన్నిముఖాన్ని
పసిమిరంగుల మేఘాన్ని
పసిపాప నవ్వు ముఖాన్ని
నేను మేఘాన్ని

# భాష

ఆలోచనకు అర్థం భాష
విజ్ఞానానికి విడిది గృహం భాష
తలచుకున్నదానికి ధ్వనిరూపంభాష
అంతర్భావాలకు రథం భాష
సంగీతానికి స్వరం భాష
మనుషులకు మనసులకు వారధి భాష
నాగరికతకు కొలబద్ద భాష
లోకానికి అభ్యుదయం భాష
ఊహాలకు ఛాయా చిత్రం భాష
నాటి నుండి నేటివరకు
లోకాన్ని నడిపింది భాష

## వ్రాతదార్ల

వ్రాసుకున్నాం
కవి కానగలడు
రవి కానని చోటని –
మెచ్చుకున్నాం
కత్తి కంటే
కలమే మిన్న - అని
ఋజువుచేయాలిగదా మన వ్రాతలను।
అంటాం ఊహాగానంతో
వింటాం కన్నులతో ।
చూస్తాం చెవులతో ।
కనగలమా నిజాన్ని
వినగలమా సత్యాన్ని
వ్రాయగలమా ఉన్నదున్నట్లు ?
లేకుంటే
అవుతుందా కవిత్వం ?
చెప్పగలమా సత్యం ?

మనలో బలహీనత
నిజాన్ని నిజమనలేకపోవడం-
నీడలకు జీవం పోయాలని తలవడం
అంతః కలహాలు పెంచుకోవడం
అనవసర విమర్శలు చేసుకోవడం
కవిత్వం ఒక కళ
కళను పోషించడం
కవి బాధ్యత
ప్రజల హృదయాలను
స్పందింపచేయాలి కవిత
లాభంలేదు నీ పుస్తకాన్ని
ఎవరూ చదివి అర్థం చేసుకోలేకుంటే
ఎవరినుండి ప్రశంసలు కోరుతున్నామో
వాళ్ళని మరచి వ్రాస్తున్నామేమో-
ఆలోచించుకుందాం
మన వ్రాతలన్నీ మనుషులకేనా
సాటి ప్రజానీకానికేనా అని
సాటివారికి పనికిరాని కవిత్వం
కాదా-అడవినికాచిన వెన్నెల ?
చెప్పుకుందాం జవాబు మనకు మనమే
కవికున్నది ఆ స్వాతంత్ర్యం !

# పోరాటం

పోరాటం - పోరాటం

పెద్దల అధికారంపై పిన్నల పోరాటం

పురుషుల ఆధిక్యతపై స్త్రీలపోరాటం

పరీక్ష పద్ధతులపై విద్యార్థుల పోరాటం

ఉద్యోగుల జబర్దస్తీపై అర్జీదార్ల పోరాటం

ధనికుల దోపిడీ విధానాలపై పేదల పోరాటం

పరపతి దార్ల వడ్డీరేట్లపై బాకీదార్ల పోరాటం

పెట్టుబడి దార్ల లాభాలపై కార్మికుల పోరాటం

భూస్వాములపై దున్నేకూలీల పోరాటం

పదవిలో ఉన్నవారిపై మాజీ దార్ల" పోరాటం

గెలిచిన వారిపై ఓడిన వారిపోరాటం

ఉన్నవారి ఉనికిపై లేనివారి పోరాటం

ఇంట్లో పోరాటం - బయటపోరాటం

ఎటు చూచినా పోరాటం

పోరాటానికి దారి తీసే

విధానాల్లో మార్పు తెస్తే

పొత్తు కుదరదా పోరాటం బదులు ?

# బదిలీ-మజిలీ

జీవితంలో ప్రతి బదిలీ ఒక మజిలీ
ఆలోచిస్తే నిత్యజీవితంలో
అన్ని అవస్థలూ బదిలీలే !
బదిలీకి ఉన్నాయి బహుముఖాలు
ఆఫీసరు అందరికీ అనుకూలుడు కాకుంటే
మారిపోతాడు అయ్యగారు త్వరలో
అంటారు మార్పించాము మేమే - అని
లేవదీస్తారు వదంతులు
పనికట్టుకుని వంతులు
ఉపగ్రహాలు పలుకుతుంటే వంతలు

ఇక బదిలీ వార్త
ఎగురుతుంది మజిలీలు దాటి రెక్కలు కట్టుకుని
శరవేగాన్ని వాయువేగాన్ని మించి –

సామానులు సర్దే గడబిడ
ఏది ముందు కట్టాలో ఏది వెనుక విప్పాలో
కట్టిన తర్వాత అన్నీ సందేహాలే
ఎల్లల పుస్తకాలు అడుగున పడ్డాయని
అయ్యగారి కళ్ళద్దాలు
దాగుడుమూత ల డుతున్నాయని
అమ్మగారి హేండ్ బ్యాగ్
అంతుకనిపించలేదని
అంతా ఒక అంతులేని హడావిడి

ఇక ప్రజలు మిత్రులు ఎలుస్తారు
టీ పార్టీలకు వీడ్కోలు విందులకు వినోదాలకు
వేస్తారు పొగడ్తల మాలలు కుప్పలు
వ్రాస్తారు వీడ్కోలు సన్మాన పత్రాలు
నిఘంటువును గాలించి కూర్చిన పదజాలంతో

ఇక చూడాలి పేదల కడగండ్ల వల్లింపులు
అందరు తమతమ మిగిలిపోయిన
కోర్కెల కొసల సవరింపుకు చేసే సన్నాహాలు
అందుకు ఇచ్చే ఎరా తడి ఆరని ఆర్జీల దొంతరలు

వీటన్నిటినీ మించినది
క్రింది ఉద్యోగస్థుల ఆర్భాటం
ఎప్పుడు దొరగార్ని ఏమి కష్టపెట్టామో
(సంవత్సరాంతపు రిపోర్టులు ఎలా వ్రాస్తారో అనికాక
పోయినా)

ఏమో ఆ ఏడుకొండల వాడికే ఎరుక
"ఎందుకైనా మంచిది ఒక వీడ్కోలు పార్టీ ఏర్పాటు చేద్దాం
వారి పేరు దేనికైనా పెడదాం
నిన్నటిదాకా చేసిన (మంచి) పనులు
పట్టీవ్రాసి బట్టీ పట్టి వల్లించి వివరిద్దాం
మిగిలిన కోర్కెల పంచాంగం విప్పేముందు –
అని అనుకుంటారేమోనని అనిపిస్తుంది

అటు తర్వాత ఉత్తరకాండ –

బదిలీ అనంతరం – కొత్త గూడు చేరడం
అన్నిటినీ తగువిధంగా సర్దుకోవడం
కొత్త ఆఫీసుకు అలవాటు పడడం
మళ్ళీ బదిలీకి ఎదురు చూడడం –
ప్రతి బదిలీ జీవితంలో ఒక మజిలీ మరి!

# సమాజం సౌఖ్యవంతమయ్యే దెన్నడు

మానవుడు సవ్యంగా ఆలోచించే దెన్నడు
మానవుణ్ణి తనతో సమానంగా చూసేదెన్నడు
సామ్యవాదం వేళ్లు నాటే దెన్నడు
శాంతి సౌఖ్యాలు చేకూరే దెన్నడు-
ఆడే మాటలు అమలుజరిగే దెన్నడు
చేసే చేతులకు చైతన్యం కలిగే దెన్నడు
పేదలకై కల్పించిన అవకాశాలు
అసలు వాళ్ళకు అందే దెన్నడు
పడగవిప్పిన స్వార్థపు పెను త్రాచుల బారినుండి
సామాన్యుడు తప్పించుకు బ్రతికే దెన్నడు
మనిషి-మనిషి అయ్యే దెన్నడు
సమాజం సౌఖ్యవంతం అయ్యే దెన్నడు॥

# నీళ్ళకు విలువ తక్కువా?

పాలకు విలువ ఎక్కువా
నీళ్ళకు విలువ తక్కువా
పాలు తెలుపని
నీళ్ళు నలుపనేగా?
రంగు ప్రధానమా
రమ్యత ప్రధానమా?
తెల్లవాళ్ళు మంచి వాళ్ళు
నల్లనివాళ్ళు చెడ్డ వాళ్లా?
తెలుపుకున్న నాణ్యం
నలుపుకు లేదా?

తెలుపుకు సాధ్యం తెచ్చిందెవరు
నలుపుకు విలువ ఇచ్చేదెవరు ?

పాలు లేకున్నా జీవించగలం
నీళ్ళులేక నిలువగలదా జగం నిముషమైనా
పాలరుచి త్రాగేతా హత్తు ఉన్న వారికే
నీళ్లు అవసరం అన్ని ప్రాణాలకు
అయినా పాలకున్న విలువ
నీళ్ళకు లేక పోవడం
మానవుడిలోని బలహీనత
అంచనాలలో గల అపభ్రంశలే-
ఉన్న వాళ్ళే విలువలు కట్టడం
తెల్లనివన్నీ పాలని
నల్లని వన్నీ నీళ్ళని తెలివితక్కువగా నమ్మడం
అందులోని అర్థం విలువ
అసలే గ్రహించలేక పోవడం
నీళ్లు లేకుంటే పాలకు
విలువే లేదని తెలుసు కోలేక పోవడం
మీసాలు పెంచుకున్న వాళ్లు
మోసాలు చేస్తారని
మీసాలు లేని వాళ్ళకు
మోసాలే తెలియవని — అనుకున్నట్లు

# ఆకలికడుపుతో

ఆకలి బాధ భరించరానిది అది వర్ణించరానిది
ఆకలి వ్యక్తికి శత్రువు
దానిని తీర్చే వాడే మిత్రుడు
పేదైనా ధనికుడైనా
కావలసిందే దాసుడు ఆకలి బాధకు
ఆకలి చంపుతుంది ఆలోచనా జ్ఞానాన్నే
వీడ్కోలు చెప్పుతుంది
విచక్షణా జ్ఞానానికి
ఆకలి వెనుదీయదు
బలి చేయడానికి మర్యాదను
ఆకలి మంటల సెగల్లో
పరికించలేరు న్యాయాన్యాలను
ఆకలి కడుపుతో
ఆరాధించలేరు దైవాన్ని కూడా
ఉపవాసాలు ఉండటాలు
అన్నంమీద కోరికను కొంత తగ్గించుకోడానికే-
కావలసింది జానెడు పొట్టకు
పిడికెడు మెతుకులే అయినా
ప్రపంచ చరిత్ర పరికిస్తే
మానవుని అంతేలేని శ్రమ
ఆకలి తీర్చుకోవడానికా
అర్థంలేని వ్యర్థప్రయాసా అనిపిస్తుంది!

## ఎర్రబంగారం

విన్నారా విన్నారా
వీనుల విందు
కన్నారా కన్నారా
కన్నుల పండుగ!

తెలుగు జాతి సంపదకు
వెలుగులు పొలాలు
తెలుగు జాతి ప్రఖ్యాతికి
విలువలు ఖనిజాలు

మైలారంరాళ్ళ నుంచి
ఎర్ర బంగారం
సింగరేణి నేలనుంచి
నల్ల బంగారం
బంగారం కంటె రాగి
బహుముఖాల వినియోగం
రత్నరాశి కంటె బొగ్గు
బ్రతుకు కెంతో ఉపయోగం
అభ్యుదయానికి మెట్లు
ఆనందానికి ఆటపట్లు
ముఖ్యమైన మన ఖనిజాలు
భూమినుండి బొగ్గును తీశాము
రాతినుండి రాగిని తీశాము
అశాంతి అలజడుల ఆపాము
మన్య జనులకు శాంతిని చేకూర్చాం
వజ్రాలు ఇనుము మైకా
మాంగనీసు రాగి గనులెన్నో
తెలుగు తల్లి ప దాలకు
అందెల కడియాలు
ఆంధ్రదేశానికి కలికితురాయిలు ॥విన్నారా॥

(మైలారం రాగిగనులు ప్రారంభోత్సవ సందర్భంలో వ్రాసినది )

# మానవసృష్టి

కొందరికి ఉంటాయి మిద్దెలు మేడలు
అందులో ఉండేవారు ఉన్నా లేకున్నా -
ఎందరికో ఉండవు పూరిగుడిసెలైనా
అందులో ఉండే వారెందరో ఉన్నా
కొందరికి ఉంటాయి వలువనన్ని దుస్తులు
వారు ధరించేది సగము శరీరానికే అయినా-
ఎందరికో ఉండవు చింపిరి పాతలైనా
వారి వంటికి బట్టలు ఎంతో అవసరమైనా-
కొందరికి ఉంటాయి విందులు కొల్లలుగా
ఆరగించడానికి వారికి ఆకలి ఉన్నా లేకున్నా-
ఎందరో ఉంటారు నిత్యం పస్తులు
మూడు పూటలా తిండి ఎంతో అవసరమున్నా-
ఉన్నవారికే అన్నీ సమకూరడం
లేనివారికి ఏవీ పొందక పోవడం
ఇది సృష్టిలోని మర్మమా ?
మరి మానవ సృష్టియా ?

## చావు బ్రతుకులు

— నిద్ర మెలుకువలే

ప్రాణానికి ఎలువ శరీరం
శరీరానికి శక్తి ప్రాణం
ప్రాణానికి పంజరం శరీరం
శరీర నికి ఆధారం ప్రాణం-
శరీరం న్ని వదలిన
ఆత్మ సర్వాంతర్యామి
రమాత్మలో భాగం జీవాత్మ
కళే బరం వీడిన జీవం
పంజరం వీడిన చిలుక

నిలకడే చావు
మారుపే జీవితం

జీవించాలంటే
చైతన్యం కావాలి
చైతన్యం లేకుంటే
మరి అది చావే అవుతుంది

# ఉత్సాహం

ఉత్సాహం జీవితానికి మసాలా
నిరుత్సాహం ఉప్పు లేని చప్పిడిపచ్చడి
మనిషి ఆశయం జీవించడం
బ్రతకడం కాదు

జీవిత దీపం మెరిసి ఆరిపోవడం మేలు
ఏడుస్తూ వెలుగుతూ ఉండడంకంటే

ఉత్సాహం ప్రాణానికి ఊపిరి
సోమరి తనం ప్రాణానికి ఉరి

మనలో ఉత్సాహం
మనుష్యుల్లోకి కాంతులు వెద జల్లుతుంది
మనలో నిరుత్సాహం
ఇతరుల్లో నిస్పృహా రేకెత్తిస్తుంది

జీవితంలో విజయాలను పొందేవారికి
ఉత్సాహం పొంగి తొణికిసలాడుతుంది
నిరుత్సాహులకు రోజులు గడుస్తాయి
జీవిత భారాన్ని బరువుగా మోస్తూ

చిగురించే జీవితాలను కూడా
జీర్ణింప చేస్తుంది నిరుత్సాహం
జీర్ణించే జీవితాలనుకూడా
చిగురింప జేస్తుంది ఉత్సాహం!

# స్వాంత పనుల పంచాంగాలు

అచ్చు వేస్తారు విసిటింగ్ కార్డులు
పెక్కు పదాలతో పంక్తి నిండుగా
అందు ముఖ్యమైనవి సంఘ సేవలు
అంతులేనన్ని సంఘాలకు సభ్యత్వాలు
కొన్నిటికి అధ్యక్ష పదవులు
మరికొన్నిటికి కార్యదర్శకత్వాలు
ఎన్నిటికో 'మాజీ' పదవులు

వస్తారు చూస్తారు అధికారంలో ఉన్నవారిని
ఇస్తారు అర్జీలను విన్నపాలను
ప్రజల క్షేమమే తమ ధ్యేయమంటూ
సమయం చూచి మధ్యలో చల్లగా
విప్పుతారు స్వాంతపనుల పంచాంగాలు !

## ఇతరులకే

మాలమాదిగలు
మనతో సమానులా ?
చెప్పులుకుట్టే మాదిగలు
బట్టలు నేసే మాలలు
మనుషులా — మనతో సమానులా ?

బట్టలు నేయకుంటే
ఎట్టుల మానం కాపాడేది
చెప్పులు కుట్టకుంటే
ఒప్పుగ నడిచేదెలా ?

విధవలకెందుకు మళ్ళీపెళ్ళి
వారి కెందుకు ఓరకొొప్పులు
మల్లెపూవులు మంచిగంధం
పసుపు కుంకుమలు పట్టువలువలు ?

విధవలు మాత్రం కారా మనుషులు
లేవా కోర్కెలు వారికి
మగువ చచ్చితే మగడికి మళ్ళీ పెళ్ళా
మగడు ఊడితే మగువకు కళ్ళనీళ్లా ?

కులానికి లేదా స్థలం
మతానికి లేదా ప్రాముఖ్యం
హెచ్చుతగ్గులుకవా దేవుడి సృష్టి
లేకుంటేమరి తేడా ఎందుకు మనుషుల్లో ?

కులం మతం స్వార్థులకల్పనలే
హెచ్చుతగ్గులు మానవ సృష్టే
మనిషికి కావలసింది మనసొక్కటే
దేవుడి దృష్టిలో కాదా అందరు సమం ?
తమకు వర్తించనంతవరకు
చెప్పుతారు ఎన్ని నీతులైనా
తప్పుతారు ఎన్ని గోతులైనా
తమదాకా వస్తేతెలుస్తుంది నిజస్వరూపం!

# సాహిత్యరాసులు

జాబిల్లి ఉన్నచోట
చల్లని వెన్నెల ఉన్నట్లు
కవులున్నచోటు
కాదా సాహిత్య నిలయం —
చూస్తేనేకాదు కవిత్వం
చూసింది అనుభవించి
వ్రాస్తేనే అవుతుంది కవిత్వం
శరీరానికి దుస్తుల్లాగే
కవితకు ఇస్తుంది ఛంధస్సు అందం
దుస్తులు శరీరం కానట్లే
ఛంధస్సు కాజాలదు కవిత్వం

భావమే ప్రాణం కవితకు
ఛందస్సు ఎటానికి ప్రేమ లాంటిదే
రసభరితం కాకుంటే
కాజాలదు ఎదీ కవిత్వం

నిజాన్ని వర్ణించి వ్రాయాలి కవి
అసత్యాన్ని అద్దంలో చూపాలి లోకానికి
సంఘాన్ని దోచుకునే వాడిని
సమాజ సేవకుడిగాను
సాటికవిని సైతానుగాను
చిత్రిస్తే అవుతుందా కవిత్వం ?

ఎర్రా రంగులతో
కలం కుంచెలతో
బంధించాలి కాగితంపై
ఖైదీలుగా భావ విహంగాలను
చూడాలి అక్షర రూపంలో
వినాలి పదస్వరంలో
ఆ బందీల సమూహాల అందాలను
అనాలి వాటిని కవిత్వపు ముక్క లని-

కలం హాలంతో సాహిత్య పొలంలో దున్నగా
పండే పంటలే సాహిత్యరాసులు !

# బంగారం

వేడి లక్కను కరిగించి
జిగురును గట్టి పరచేట్లు
బంగారం ఉదార హృదయాలను విశాలం చేస్తుంది
సంకుచిత హృదయాలను కుంచింప చేస్తుంది
బంగారాన్ని కలిగి ఉండడం భయంతో నివసించడమే
దాన్ని కావాలని కోరడం దుఃఖ సాగరంలో మునగడమే

బంగారపు కవచం దాస్తుంది ఎన్నో లోపాలను
చింపిరి పాతల్లో లోపాలు లేకున్నా కనిపిస్తాయి
బంగారం కొందరికి శాపం
మరి కొందరికి వరం
మేధావి కనిపెట్టి చూపిస్తాడు ప్రపంచానికి బంగారాన్ని
జూదగాడు పోగొట్టుకుంటాడు
సంపాదించిన బంగారం
దళారివాడు చేస్తాడు వడ్డీ వ్యాపారం బంగారంతో
విచక్షణాజ్ఞాని సద్వినియోగం చేస్తాడు బంగారాన్ని
పిసినిగొట్టు కడుపు కాల్చుకొని దాస్తాడు బంగారం -

బంగారం కాదు చెడ్డది తనకై తానెన్నడూ
దాన్ని వాడేవారి చేతిలో ఉంటుంది దాని గుణం !

# ఆరాటం - ఉబలాటం

న్యాయం కోసం పోరాటం చేయాలని ఆరాటం
ఆ పోరాటంలో గెలవాలని ఉబలాటం-
ఆకాశంలో ఎగరాలని ఆరాటం
అక్కడి రహస్యాలు పెక్కులు చూడాలని ఉబలాటం-

పదవులు చవి చూడాలని ఆరాటం
అందులో మాలిన్యం తుడిచి వేయాలని ఉబలాటం—
పేదరికం రుచి చూడాలని ఆరాటం
పేదల బాధలు తీర్చాలని ఉబలాటం—
కారులో వెళ్ళాలని ఆరాటం
దారిన వెళ్ళే వారికి సాయం చేయాలని ఉబలాటం—
నూతులు త్రవ్వాలని ఆరాటం
గోతులు పూడ్చాలని ఉబలాటం—
దేశం చూడాలని ఆరాటం
దాస్య విమోచన చేయాలని ఉబలాటం—
భాషలు నేర్వాలని ఆరాటం
పది మందితో సంభాషించాలని ఉబలాటం—
అందరినీ దరి చేర్చాలని ఆరాటం
అందుకే కృషి చేయాలని ఉబలాటం—
ఏటిలో దూకాలని ఆరాటం
నీటిలో తేలాలని ఉబలాటం—
ధనికుల మనసులు మార్చాలని ఆరాటం
పేదల కన్నీటిని తుడవాలని ఉబలాటం—
ఏమేమో చేప్పాలని ఆరాటం
ఏమేమో చేయాలని ఉబలాటం

## కొత్త చిగుళ్లు

మంచి కావాలంటే మార్పు రావాలి
మనిషి పెరగాలంటే మార్పు కావాలి
మనిషికి మంచి మార్పు కావాలి

కాలం మారింది
వేషం మారింది
భాష మారింది
మనుషులు మారాలి
మనసులు మారాలి
వాడిన పూపులు రాలాలి
ఎండిన ఆకులు ఊడాలి
కొత్త పూవులు పూయాలి
కొంగ్రొత్త చిగుళ్ళు తొడగాలి
బూజు పట్టిన బుద్ధులు పోవాలి
మనుషుల మనసులు మళ్ళీ చిగురించాలి
/ పీదల దోచే బుద్ధులు పోవాలి
పేదల కాచే రోజులు రావాలి
మనుషులు పెరగాల
మనసులు ఎదగాలి

# ఎగిరేపక్షులు

నే నెక్కిన రైలు పెట్టెలో
నలుగురు యువకుల చూశాను
నవ్వుల పువ్వుల యువకులను
నవ్వుల రవ్వల యువకులను

వారి కెవ్వన నవ్వే వయసులు
నవ్వుకే నాణ్యం దిద్దే మనసులు

ఫక్కున నవ్వే హృదయాలు
నాలో కవితా భావాలను రేకెత్తించాయి
ఆశలే రెక్కలుగా
ఆశయాలే పల్లకీలుగా
జీవిత గగనంలో రివ్వున ఎగిరే పక్షులు-
అమృతం చిలికే గుండెల్లో
ఆనందం విరిసే రోజాలు!
ఫక్కున నవ్వి గ్రక్కున దిగి
గబుక్కున ఎక్కి – డబుక్కున దిగి
సంతోష పరిమళాన్ని
సరిగమల సంగీతాన్ని
పంచి పెడుతున్నారు పది మందికీ
నలుగురు
భలే నలుగురు
నన్నాకర్షించిన నలుగురు
రెక్కలు లేకుండా ఎగిరే పక్షులు
కడుపు చెక్కలయ్యేలా నవ్వే మనుషులు
చీకు చింతా తెలియదేమో
బరువు బాధ్యత ఎరుగరేమో
అడ్డు హద్దులు లేవేమో

అలలా కదిలేరు

ఊయలలా ఊగేరు

కదిలే రైలు మెదిలే వారు

కలకలమనే కంఠ స్వరాలు

మనసునే కదిలించే మాణిక్యాలు

హృదయాన్నే మెదిలించే వాక్యాలు

అల్లరికి ఆనందానికి

గొలుసు కట్టు వారధులు

సహవాసానికి సంతోషానికి

సావకాశ్లైట్లే ఆకురాతి తునకలు!

ప్రక్క వారితో పనిలేకుండా

ఎక్కడి కెళ్ళేది పట్టించుకోకుండా

కేరింతలతో గోరింకల మరిపిస్తూ

పట్ట పగ్గాలు లేని మత్తేభకిశోరాల్లా

దారం తెగన గాలిపటాల్లా

పంజరం వీడిన పక్షుల జంటల్లా

బ్రేక్ చెడిన మెర్సిడిస్ బెన్జ్ లారీల్లా

సుడిగాలిలో తెర చినిగిన నావల్లా

వడిగా వదలిన బాణాల్లా

వాడి కోరల త్రాచుల్లా

వేడి చూపుల సూర్యుడి కిరణాల్లా
గాలిలో ఎగిరే పక్షుల్లా
నీటిలో ఈదే చేపల్లా
వీచేగాలిలా
రగిలే నిప్పులా
వెలిగే దివ్వెలా
విరిసే పువ్వుల్లా
మెరిసే మెరుపుల్లా
ఉరిమే ఉరుముల్లా
పాడే కోకిలల్లా
ఆడే మయూరాల్లా
అందాల చిలుకల్లా
మనుషులున్న మాటే మరచి
మనసుల ముసుగులు విప్పి
మాటల ఆటల పోటీల్లో
అనుక్షణం తీరిక లేకుండా
ఆఖరు క్షణం దాకా
అలసట లేకుండా
అమృత వర్షం కురిపించి
ఓ చిన్న తుఫాను వచ్చిపోయినట్లు
ఓ సుడిగాలి వీచి వెళ్ళినట్లు
వడ గాలికి చోటిస్తూ

కంపార్టుమెంటంతా
వీళ్లతోనే ఖాళీ అయినట్టు
అనిపించింది వాళ్ళు దిగగానే
ఆ రెక్కలు లేని చిరు దేగలు
తుర్రున రైలు డబ్బాకిటికీల్లోంచి
కాలుదూసి మెరుపుల్లా
మాయమవగానే
అర్థం కాలేదు కాసేపు
మనసు తేరుకుండే వరకు-
కాళీ పెట్టెలో పగలే చీకటి!
నిశ్శబ్ద దేవత తాండవం!!
నిజంగా ఆ వచ్చింది వెళ్ళింది
కుర్ర వాళ్ళేనా - లేక
మమ్మల్ని వెర్రి వాళ్ళుగాచేసే
ఓ మినీ సైక్లోనా !
లేకుంటే కంపార్టుమెంట్
కాళీ ఎలా అవుతుంది?
తుఫాను చిహ్నాలు ఎలా మిగులుతాయి?
అంత మంచి తుఫాన్ మళ్ళీ ఎప్పుడొస్తుందో!
అసలు వస్తేచాలు ఎప్పు డొచ్చినా
చంద్రుడ్ని క్షణంలో చేరే ఈ రోజుల్లో
ప్రపంచం గుమ్మడి కాయంత చిన్నదైంది

ఇంతచిన్న లోకంలో మళ్ళీ కలవడం
బహుశా అంత దుర్లభం కాకపోవచ్చు *

ఆ ఉరుము ఉరమగానే
ఆ ఎడుగు పడగానే
ఆ రైలు పెట్టె మారింది రాకెట్టుగా
కాకుంటే నిముషంలో దూసుకు పోగలమా
హృదయాలు చీల్చుకుని రోదసీకు డ్యాల్లోనికి-

ఇలాంటి తోణికిసలాడే
నవయవ్వనాన్ని - యువశక్తిని
వృధా చేస్తున్నామా
బూడిదలో పోసిన పన్నీరులా
అడవిని కాచిన వెన్నెలలా
ఈ పొంగి పొరలే భావతరంగిణిని
ఈ మండి రగిలే ఉడుకు రక్తాన్ని
ఉపయోగించ లేమా
అభ్యుదయ పథం నిర్మించడానికి
క్రాంతి పటం చిత్రించడానికి
శాంతి తోరణాలు కట్ట డానికి

తేనె పూసిన కత్తులు
గోముఖ వ్యాఘ్రాలు
సంఘాన్ని మ్రింగే తిమింగలాలు
దేశాన్నే దోచుకునే గజదొంగలు
ప్రజల పచ్చి రక్తాన్నే పీల్చే రాక్షసులు
పడుచు వాళ్ళను పైకి రానిస్తారా-
పచ్చగా దేశాన్ని బాగుపడనిస్తారా-!
కులం పేరుతో కుమతులు
మతం పేరుతో దుర్మతులు
మనిషిని మనిషిగా మన నిస్తారా
మనలను మంచిగా బ్రతకనిస్తారా-
స్వార్థానికి దాసులుగా
ధనానికి బానిసలుగా
వ్యక్తిత్వాన్ని చంపుకుని
పరుల పాదాలకు పూజలు చేస్తూ
స్వంతానికి ఇతరుల గొంతులు కోయను
వెను దీయని స్వార్థపరులున్నంత కాలం
లేదు మోక్షం దేశానికి
లేనే లేదు రక్షణ సన్మార్గులకు
ఆసక్తి విజ్ఞానికి గీటురాయి
యువత భావికి ఊతకర్ర

ఆచారానికి మూఢంగా కట్టుబడకుండా
దేనినీ ప్రశ్నించకుండా ఒప్పుకోరాదు యువతరం!
ఉత్తర కాండ =
అలాగే నలుగురు చిట్టెమ్మలు
అప్సరల్లా ఆ పెట్టెలో ఊడిపడితే –
ఏమయ్యేదో ఆ 'మినీసైక్లోన్ !
అది మరో అధ్యాయానికి కథ

(15-4-78 సింహాద్రి ఎక్స్‌ప్రెస్‌లో విశాఖ నుండి రాజమండ్రి ప్రయాణంలో నేనున్న రైలుపెట్టెలో నలుగురు యువకులు అనకాపల్లి వరకు ప్రయాణం చేస్తూ వాళ్ళు అంతులేని ఆనందంతో తేలి ఆడుతున్న సందర్భంలో నాకు తట్టిన ఊహలు )* తర్వాత 17-4-78 వాళ్ళను విశాఖలో కలుసుకొని ఈ గేయం చదివి వినిపించడం జరిగింది )

